ISSN 2766-0168
అంతర్జాల త్రైమాస పత్రిక
వ్యవస్థాపక సంపాదకులు
కీ.శే. గురజాడ వేంకట అప్పారావు
www.prakasika.org

# ప్రకాశిక

సమగ్ర సాహిత్య, సామాజిక పత్రిక

మమత-సమత-మానవత
www.gurajada.org

సంపుటి 1 | సంచిక 4 జూలై-సెప్టెంబర్, 2021



## తెలుగు నవలా విరించి

### శ్రీ కొవ్వలి లక్ష్మీ నరసింహారావు

ISSN 2766-0168
అంతర్జాల త్రైమాస పత్రిక
వ్యవస్థాపక సంపాదకులు
కీ.శే. గురజాడ వేంకట అప్పారావు
www.prakasika.org

# ప్రకాశిక

**సమగ్ర సాహిత్య, సామాజిక పత్రిక**

మమత-సమత-మానవత
www.gurajada.org



## యువ కథాకారులకి ఆహ్వానం
## 'కారా' స్మారక కథల పోటీ



ప్రథమ బహుమతి : రూ. **2,500**
ద్వితీయ బహుమతి : రూ. **1,500**
తృతీయ బహుమతి : రూ. **500**

గురజాడ ఫౌండేషన్ (అమెరికా) వారిచే ప్రచురింపబడుతున్న చారిత్రాత్మక అంతర్జాల తెలుగు పత్రిక 'ప్రకాశిక' నిర్వహిస్తున్న 'కారా' స్మారక కథల పోటీ కి ప్రపంచవ్యాప్తంగా ఉన్న 20-50 సంవత్సరాల మధ్య వయసు గల తెలుగు వారినుంచి కథలు ఆహ్వానిస్తున్నాం.

మంచి కథ మంచి స్నేహితుడిలాంటిది. మంచి కథకుడు స్నేహవల్లరి లాంటి వాడు. కొంతమంది రచయితలు ఎన్ని కథలు రాసినా వాళ్ళ పేరు, గుర్తింపు ఒక రచనతో ముడిపడి ఉంటాయి. 'యజ్ఞం' తో పేరుగాంచిన కాళీపట్నం రామారావు గారు "కారా మాస్టారు" గా, "కథా నిలయ" స్రష్ట గా, ద్రష్ట గా స్థిరపడ్డారు. ఒక రచన కోట్లాది పాఠకులని ఎలా పరవశం చేసి, ప్రభావితం చేయగలదో అన్న విషయానికి నిదర్శనం 'కారా' గారు, ఆయన రచనలు. ఆయన స్ఫూర్తితో నవతరం "కథాకారుల" తయారీకి దోహదపడాలనే ఉద్దేశంతో 'కారా' స్మారక కథల పోటీ ని నిర్వహిస్తున్నాం.

ప్రథమ, ద్వితీయ, తృతీయ బహుమతులు పొందిన రచనలను ప్రకాశిక తొలి వార్షిక సంచిక (అక్టోబర్-డిసెంబర్) లో ప్రచురిస్తాము. మిగతా రచనలలో కొన్నిటిని రాబోయే సంచికలలో గానీ, అంతర్జాల సంచికలో గానీ ప్రచురిస్తాము.

**మీ రచన పంపించవలసిన ఈ-చిరునామా: editor@prakasika.org**
**సబ్జెక్ట్ లైన్ లో 'ప్రకాశిక కారా స్మారక కథల పోటీ కోసం' అని రాయండి.**

**కథలు పంపించడానికి చివరి రోజు: 15 సెప్టెంబరు 2021.**
**నియమ నిబంధనల కోసం www.prakasika.org ని సందర్శించండి లేక editor@prakasika.org కి రాయండి.**

# ప్రకాశిక సంపాదక వర్గం



## ఆచార్య కొవ్వలి గోపాలకృష్ణ

ప్రధాన సంపాదకులు

పుట్టినది పశ్చిమగోదావరి జిల్లాలోని ఇరగవరం అగ్రహారం. పెరిగినది చాలా వరకు తణుకులో. తాడేపల్లిగూడెం కళాశాల నుంచి డిగ్రీ, ఉమ్మడి రాష్ట్ర రాజధాని భాగ్యనగరంలోని కేంద్రీయ విశ్వవిద్యాలయం నుంచి ఎం.ఎస్.సి., దేశ రాజధానిలోని ఢిల్లీ విశ్వవిద్యాలయం నుంచి ఎం.ఫిల్., పి.హెచ్.డి. చేశారు. గత 27 సంవత్సరాలుగా అమెరికాలో నివాసం. చాలా సంవత్సరాలు వైద్య విశ్వవిద్యాలయాలలో ఆచార్యులుగా కేన్సర్ వ్యాధికి సంబంధించిన అంశాలపై పరిశోధనలు జరిపారు. ప్రస్తుతం అంతర్జాతీయ ఫార్మస్యుటికల్ కంపెనీలో కేన్సర్ మందులు రూపొందించే శాస్త్రవేత్తగాను, హ్యూస్టన్ లోని టెక్సాస్ విశ్వవిద్యాలయంలోని వైద్యశాస్త్ర విభాగంలో అనుబంధ ఆచార్యులుగానూ పనిచేస్తున్నారు. అంతర్జాతీయ కేన్సర్ పరిశోధనలకి సంబంధించిన అంతర్జాతీయ పత్రికకి ప్రధాన సంపాదకులుగా వ్యవహరిస్తున్నారు. మాటల మాలలల్లడం ప్రవృత్తి. అడపాదడపా రాసిన కవితలు, కథలు, వ్యాసాలు ఒకచోట కూర్చి "మనస్వినీయం" అన్న పేరుతో ఇటీవల ఒక పుస్తకం ప్రచురించారు.



## మా శర్మ

గౌరవ సంపాదకులు

మా శర్మగా సుపరిచితులైన మాచవరం వేంకట చెంచురామ మారుతి సుబ్బరాయశర్మ 1967 సంవత్సరం నవంబర్ 29వ తేదీన గుంటూరు జిల్లా, నరసరావుపేటలో జన్మించారు. పాత్రికేయులు, కాలమిస్ట్‌గా ప్రసిద్ధులు. తెలుగువారికి సొంతమైన అవధాన ప్రక్రియ, ఆశుకవిత్వంలో అగ్రగణ్యులు, ఆరాధ్యులైన కొప్పరపు కవులు మా శర్మగారికి మాతామహులు. ఆ మహాకవుల పేరిట శ్రీ కొప్పరపు కవుల కళాపీఠాన్ని 2002లో స్థాపించారు. వారి విగ్రహాలను విశాఖపట్నం సాగరతీరంలో, నరసరావుపేటలో స్థాపించారు. కొప్పరపువారి సాహిత్యాన్ని సేకరించి దొరికినంత వరకూ గ్రంథస్థం చేశారు. ప్రతియేటా శ్రీ కొప్పరపు కవుల ప్రతిభా పురస్కారాలు ప్రదానం చేస్తున్నారు. ప్రముఖులు పీసపాటి నరసింహమూర్తి, వేటూరి సుందరరామ్మూర్తి , మల్లాది చంద్రశేఖరశాస్త్రి, మంగళంపల్లి బాలమురళీకృష్ణ, ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం,

నేదునూరి కృష్ణమూర్తి, కె.విశ్వనాథ్, బేతవోలు రామబ్రహ్మం, మేడసాని మోహన్, గరికిపాటి నరసింహారావు, మాడుగుల నాగఫణిశర్మ, పి.సుశీల, సిరివెన్నెల సీతారామశాస్త్రి మొదలు ఎందరో తెలుగు, జాతీయ కవులు, కళాకారులు ఆ పురస్కారం అందుకున్న వారిలో ఉన్నారు. ప్రస్తుతం ఆంధ్రపత్రిక దినపత్రికకు కన్ సల్టింగ్ ఎడిటర్ గా పాత్రికేయ సేవలు అందిస్తున్నారు. ఎన్నో ఏళ్ల నుండి మీడియాలో ఉన్నారు.



## శ్రీమతి గురజాడ అరుణ

నిర్వాహక సంపాదకులు

గురజాడ వేంకట అప్పారావుగారి ముని మనుమరాలు శ్రీమతి గురజాడ అరుణ. ముంబైలో పుట్టి పెరిగిన వీరు IT రంగంలో ప్రాజెక్ట్ మేనేజర్ గా పనిచేస్తున్నారు. ముత్తాతగారి అకాల మరణంతో అసంపూర్ణంగా మిగిలిపోయిన వారి సాహితీ సేవలు, సంఘ సంస్కరణ కార్యక్రమాలను ముందుకు తీసుకెళ్ళే క్రమంలో గురజాడ ఫౌండేషన్ (అమెరికా) స్థాపించారు. గురజాడ వారి పేరిట ఎన్నో సేవా కార్యక్రమాలు చేస్తూ ముత్తాతగారి స్మృతిని చిరస్థాయిగా ఉంచుతున్నారు.

## శ్రీ గురజాడ రవీంద్రుడు

సంపాదక సలహాదారు



గురజాడ వేంకట అప్పారావుగారి మునిమనుమడు శ్రీ గురజాడ రవీంద్రుడు. 2014లో గురజాడ ఫౌండేషన్ (అమెరికా) స్థాపనలో ముఖ్య భూమిక పోషించారు. ఫౌండేషన్ లక్ష్యాలను, ఆశయాలను ముందుకు తీసుకెళ్ళ డంలో చురుకైన పాత్ర పోషిస్తూ ముత్తాతగారి అడుగుజాడల్లో పయనిస్తున్నారు. గురజాడ ఫౌండేషన్ (అమెరికా) ఇండియన్ చాప్టర్ కు ప్రెసిడెంట్ గా వ్యవహరిస్తున్నారు.



## శ్రీ విహారి

సంపాదక సలహాదారు

విహారి అనే కలం పేరుతో సుప్రతిష్ఠులైన శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు 1941లో తెనాలిలో జన్మించారు. వీరు 12 కథాసంపుటాలు, 15 విమర్శనాత్మకమైన వ్యాస సంపుటాలు, ఒక వ్యాస కదంబం, 7 నవలలు, 5 కవితా సంపుటాలు, ఒక దీర్ఘ కథాకావ్యం- పుస్తకాల రూపంలో వెలువరించారు. అన్ని

ప్రసిద్ధ తెలుగుపత్రికలలోనూ 300కి పైగా వీరి రచనలు ప్రచురితమయ్యాయి. వివిధ పత్రికల్లో పరిచయాలూ-పరామర్శలు, బతుకు గీతలు, కథావిహారం వంటి శీర్షికలనూ నిర్వహించారు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ పురస్కా రం, అజో విభో కందాళం ఫౌండేషన్ (AVKF) వారి జీవన సాఫల్య పురస్కా రం, ఆం.ప్ర భాషా దినోత్సవ పురస్కా రం, తె.వి.వి.కీర్తి పురస్కా రం లాంటి ఎన్నో ప్రతిష్ఠాత్మకమైన పురస్కా రాలు అందుకున్నారు. ఎల్.ఐ.సి.లో జనరల్ మేనేజర్ గా పదవీ విరమణ చేసి, హైదరాబాద్ లో నివాసం ఉంటున్నారు.



## ఆచార్య వెలమల సిమ్మన్న

సంపాదక సలహాదారు

బహుముఖ ప్రజ్ఞాశాలిగా వాసికెక్కిన ఆచార్య వెలమల సిమ్మన్నగారు 1955 సంవత్సరం మార్చి 1వ తేదీన శ్రీకాకుళం జిల్లా, జలుమూరు మండలం, తిమడాం గ్రామంలో జన్మిం చారు. ఆంధ్ర విశ్వకళా పరిషత్, స్కూల్ఆ ఫ్ డిస్టెన్స్ ఎడ్యుకే షన్ లో తెలుగుశాఖలో అధ్యాపక ధర్మం నిర్వర్తిం చారు. భాష, సాహిత్యం, వ్యాకరణం, భాషా శాస్త్రం, విమర్శ, పరిశోధన మొదలైన రంగాలకు సంబంధించి 83 గ్రంథాల్ని రాశారు. 440కి పైగా పరిశోధన పత్రాలు ప్రముఖ పత్రికల్లో ప్రచురితమయ్యాయి. 160కి పైగా వివిధ సెమినార్లలో హాజరై పరిశోధన పత్రాల్ని సమర్పించారు. 50కి పైగా రేడియో ప్రసంగాలు చేశారు.



## ఆచార్య గుమ్మా సాంబశివరావు

సంపాదక సలహాదారు

తెలుగు సాహిత్యంలో ప్రముఖ విమర్శకులుగా, పుస్తక సమీక్షకులుగా, అన్నింటికీ మించి మంచి అధ్యాపకునిగా పేరొందిన గురువర్యులు ఆచార్య గుమ్మా సాంబశివరావుగారు. స్వగ్రామం గుంటూరు జిల్లాలోని వేజెండ్ల. 2018లో ఆంధ్ర లయోలా కళాశాలలో తెలుగు శాఖాగ్రణిగా పదవీ విరమణ చేశారు. మహాకవి గురజాడ 150వ జయంతి కానుకగా 2011 డిసెంబరులో కన్యాశుల్కంలో హాస్యం పేరుతో ఓ గ్రంథాన్ని ముద్రించారు. 2012 డిసెంబరు 27,28,29 తేదీల్లో తిరుపతి నగరంలో నాలుగో ప్రపంచ తెలుగు మహాసభలను పురస్కరించుకుని తెలుగు అకాడమీ వారు ఆచార్య గుమ్మా సాంబశివరావు రచించిన తెలుగువాఙ్మయ చరిత్ర-రచయితలు అనే గ్రంథాన్ని ముద్రించారు. నూటముప్పైకి పైగా వివిధ పత్రికల్లో వ్యాసాలు, 150 కి పైగా

పుస్తక సమీక్షలు, 60 కి పైగా ఆకాశవాణిలో ప్రసంగాలు అనేక జాతీయ అంతర్జాతీయ వేదికల మీద వివిధ అంశాల మీద ప్రసంగాలు, సాంబశివరావుగారి విస్తృత ప్రతిభకి తార్కాణం. సాంబశివరావు గారు అనేక జాతీయ, అంతర్జాతీయ సన్మానాలు, సత్కారాలు పొందారు. ఏ అంశంపైనైనా అనర్గళంగా ప్రసంగించే వీరి సామర్థ్యాన్ని గుర్తించి అనేక సాహిత్య పీఠాలవారు 'ప్రసంగప్రజ్ఞా నిధి', 'ఉపన్యాసకేసరి' వంటి బిరుదులతో సత్కరించారు.

## డా.సి. భవానీదేవి



సంపాదక సలహాదారు రచయిత్రి, విమర్శకురాలు

ఆంధ్రప్రదేశ్ సచివాలయం నుంచి ప్రభుత్వ ఉప కార్యదర్శి గా పదవీ విరమణ చేశారు. 15 కవితా సంపుటులు, వివిధ ప్రక్రియల్లో 51 గ్రంథాలు వెలువరించారు. వీరి పలు కవితలు, కథలు ఇతర భాషల్లోకి అనువదించబడ్డాయి. డాక్టర్ సి. భవానీదేవి పలు అవార్డులు, ప్రశంసలు అందుకున్నారు. ఆకాశవాణి, ప్రసారభారతి జాతీయ స్థాయిలో ప్రతి ఏటా ప్రతిష్ఠాత్మకంగా నిర్వహించి ప్రసారం చేసే జాతీయ కవి సమ్మేళనంలో భాగంగా 2019 సంవత్సరానికి తెలుగు కవయిత్రిగా ఎంపికయ్యారు.



## డా. రేవూరి అనంత పద్మనాభరావు

సంపాదక సలహాదారు

పద్మనాభరావు వందకుపైగా అష్టావధానాలు చేశారు. 120 గ్రంథాలు ప్రచురించారు. అందులో నాలుగు కథా సంపుటాలు, నాలుగు నవలలు, 12 అనువాదాలు, 11 జీవితచరిత్రలు, 12 సివిల్స్ పరీక్షల గ్రంథాలు, పరిష్కరణలు, వ్యాఖ్యలు, పరిశోధనాత్మక గ్రంథాలు వెలువరించారు. వీరి రచనలపై నాలుగు విశ్వవిద్యాలయాల నుండి ఆరుగురు పరిశోధక విద్యార్థులు ఎం.ఫిల్. / పి.హెచ్.డి. డిగ్రీలు సంపాదించారు. పద్మనాభరావుకు 1993లో తెలుగు విశ్వవిద్యాలయ అనువాద పురస్కా రము, 2000లో కేంద్ర సాహిత్య అకాడమీ అనువాద పురస్కా రం లభించాయి. ఢిల్లీ తెలుగు అకాడమీ, మదరాసు తెలుగు అకాడమీ సనాతన ధర్మచారిటబుల్ ట్రస్టు తదితర అవార్డులు పొందారు. కందుకూరి రుద్రకవి రచనలపై పి.హెచ్.డి. చేశారు. 1967లో కందుకూరు ప్రభుత్వ కళాశాల అధ్యాపకులుగా ఉద్యోగ జీవితం ప్రారంభించి 1975 నుండి 2005 వరకు ఆకాశవాణి, దూరదర్శన్ లో పదవీ బాధ్యతలు మూడు దశాబ్దాలు నిర్వహించి, ఢిల్లీ అదనపు డైరెక్టర్ జనరల్ గా పదవీ విరమణ చేశారు. 2005 - 10 మధ్య తిరుమల

తిరుపతి దేవస్థానంలో పనిచేసి శ్రీ వేంకటేశ్వర భక్తి ఛానల్ కు అంకురార్పణ దశలో కృషి చేశారు. కంచికామకోటి పీఠాధిపతి వీరిని ఆస్థాన విద్వాంసులుగా సత్కరించారు. అమెరికా, యు.కె, జర్మనీ దేశాలలో పర్యటించి ఉపన్యసించారు. 1200 వ్యాసాలు వివిధ పత్రికలలో ప్రచురించారు. 74 సంవత్సరాల పద్మనాభరావు హైదరాబాదులో స్థిరపడ్డారు.

## డా. నాగసూరి వేణుగోపాల్

సంపాదక సలహాదారు



దేశవ్యాప్తంగా తొమ్మిది ఆకాశవాణి కేంద్రాలలో సుమారు ముప్పైయి మూడు సంవత్సరాలుగా పనిచేస్తూ మరోవైపు రచయితగా, కాలమిస్టుగా, సంపాదకునిగా డా. నాగసూరి వేణుగోపాల్ ఇంతవరకు 60 పైగా పుస్తకాలు వెలువరించారు. అనంతపురం జిల్లా కొనతట్టు పల్లిలో 1961లో జన్మించిన నాగసూరి ఎస్వీయూ నుంచి ఫిజిక్స్‌లో ఎం.ఎస్సీ., ఎం.ఫిల్., తర్వాత ఆంధ్ర విశ్వవిద్యాలయంలో జర్నలిజంలో పి.హెచ్.డి. గడించారు. పరిశీలన, పరిశోధన, ప్రణాళికతో ఆకాశవాణి కార్యక్రమాలు నిర్వహించిన నాగసూరి రేడియో పరిచయ కార్యక్రమ నిర్వహణలో పేరుపొందడమే కాక 'ఆదివాసీ అంతరం', 'శతవసంత సాహితీ మంజీరాలు', 'వెలుగుజాడ', 'అన్నమయ్య పదగోపురం', 'జీవనబింబం', 'చిత్తూరు జిల్లా జీవన చిత్రం' వంటి విలువైన కృషి ద్వారా చిరకాలం నిలబడే ముద్ర వేశారు. విజ్ఞానశాస్త్రం, సాహిత్యం, పత్రికారంగం, ప్రసారమాధ్యమాలు, చరిత్ర, భాష వంటి విషయాలపై పరిశోధనాత్మక గ్రంథాలు వెలువరించారు. గురజాడ, తాపీ, పొట్టి శ్రీరాములు, నార్ల, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, జి.వి.కృష్ణారావు, విద్వాన్ విశ్వం వంటి వారి పరిశోధనాత్మక పుస్తకాలు వెలువరించిన నాగసూరి 'సాహితీ వీక్షణం', 'సాహితీ స్పర్శ' వంటి విమర్శనా గ్రంథాలు కూడా రచించారు. 20వ శతాబ్దం ముగుస్తున్న వేళ విజయవాడ ఆకాశవాణి ద్వారా మూడేళ్ళ పాటు పరిచయం చేసిన శతాబ్దపు వంద ఉత్తమ తెలుగు గ్రంథాల గురించి వెలువరించిన 'శతవసంత సాహితీ మంజీరాలు' అత్యంత విలువైన సంకలనం. ఇంకా సాహిత్య అకాడమీకి 'సైన్స్ ఫిక్షన్' 'వైజ్ఞానిక కథలు', అలాగే 'కథావరణం', 'మదరాసుబదుకులు' కథా సంకలనాలను మిత్రులతో కలిసి వెలువరించారు. 'స్థానిక మూలాలు', 'విస్మృత ప్రముఖులు', 'జానపదకళలు', 'హెచ్.ఐ.వి./ఎయిడ్స్', 'ఆదివాసుల జీవితం', 'ఇతర ప్రాంతాల తెలుగువారు', 'అన్నమయ్య' వంటి అంశాలపై దృష్టి నిలిపి కృషి చేసిన వేణుగోపాల్ ప్రస్తుతం తెలుగువారు విస్మరించిన గాంధీ తత్వంలోని ప్రయోజనకరమైన కోణాలను వివరించడానికి తన బృందంతో కలిసి శ్రమిస్తున్నారు. వీరి ప్రస్తుత నివాసం హైదరాబాదు.






# స్వేచ్ఛా భారతికి వజ్ర హారం

ఈ సంవత్సరం భారత దేశం 75 వ స్వాతంత్ర్య దినోత్సవం జరుపుకోవడం ప్రపంచంలోని భారతీయులందరికీ గర్వకారణం. అత్యంత క్లిష్టమైన సామాజిక, భౌగోళిక, ఆర్థిక, సాంస్కృతిక, మత పరమైన వైవిధ్యాలున్న శతాధిక కోటి ప్రజానీక ఆకాంక్షలకి, ఆశలకి ఆలవాలమైన భారత దేశం ప్రపంచానికి ఎన్నో రంగాలలో ఆదర్శంగా నిలుస్తోంది. కేవలం 75 సంవత్సరాలలో బడుగు దేశం అన్న ముద్రని చెరుపుకుని అత్యంత ప్రభావశీలమైన దేశంగా పరిణతి చెందింది అంటే సామాన్య విషయం కాదు. ముఖ్యంగా ఇరుగు పొరుగు దేశాల పరిస్థితితో పోలిస్తే భారత దేశం సుస్థిరమైన గణతంత్ర రాజ్యంగా ప్రపంచంలో గౌరవాన్ని సంపాదించుకుంది. అంతేకాదు, ప్రపంచ ఆర్థిక వ్యవస్థ స్థిరత్వానికి మూల స్తంభంలా నిలుస్తోంది. నెహ్రూ నాటిన IIT లాంటి విత్తనాలు విస్తరించి ప్రపంచ నలుమూలలూ వ్యాపిస్తే, పి.వి. విస్తరించిన స్వేచ్ఛా విపణులు ప్రపంచాన్ని భారత దేశ వాకిటికి తీసుకువచ్చాయి. ఈ మహత్ పరిణామాలన్నిటికీ దోహద పడ్డది భారత ప్రజానీకం. మారే కాలానికి అనుగుణంగా మారుతూ, మారే వ్యవస్థలతో అనుసంధానం చేసుకుంటూ, వేగంగా మారే సాంకేతికతని అందిపుచ్చుకుంటూ, నిరంతర మార్పుని ఆహ్వానిస్తూ, అనుసరిస్తూ, దేశీయంగా జీవిస్తూ, ప్రాపంచికంగా ఆలోచించ గలిగే తత్వం గల భారతీయులు నిజంగా అభ్యుదయ భావాలు గల ప్రపంచ పౌరులు.

గత 75 సంవత్సరాలుగా భారత దేశం భౌతికంగా ఎన్నో సాధించింది. దేశీయ పరిజ్ఞానంతో ఎన్నో ఉపగ్రహాలని అంతరిక్షం లోకి పంపడం, శాంతియుత ప్రయోజనాలకోసం అణు శక్తిని ఉపయోగించే సాంకేతికతని పెంపొందించుకోవడంతో అగ్ర దేశాల సరసన నిలిచింది. ఒక గౌరవ ప్రదమైన, నమ్మక ప్రదమైన ప్రజాస్వామ్య దేశంగా పేరుగాంచింది.

దీనికి ప్రధాన కారణం పాలకులు మారినా మారని విదేశాంగ విధానం, విలువలు, అలీన విధానం.

ఇంత సాధించినా సాధించ గలిగినది సాధించలేదేమో అని అనిపిస్తుంది. ఎంతోమంది శాస్త్ర వేత్తలని తయారు చేస్తున్నాం. ఎన్నో శాస్త్ర విజ్ఞాన కేంద్రాలని స్థాపించాం. కానీ, ప్రపంచ స్థాయి పరిశోధనలు గాని, శాస్త్ర విజ్ఞాన అవధులని విస్తృత పరచగల ఆవిష్కరణలు గానీ జరగలేదు. సాంకేతిక రంగంలో చూస్తే, ప్రపంచం మొత్తం వాడే ఏ ఒక్క software కూడా భారత దేశంలో తయారు కాలేదు. మానవ వనరులని, మేధస్సుని ఎగుమతి చేసే ప్రధాన దేశంగా మాత్రం గుర్తింపు పొందేము. మనం ఎగుమతి చేసిన మేధావులు మైక్రోసాఫ్టు, గూగుల్ లాంటి సంస్థలకి అధినేతలు అవుతుంటే గర్వంగా ఉంటుంది గానీ అలాంటి వాళ్ళకి భారత దేశం లో ఎందుకు అవకాశం, వాతావరణం, వసతులు కల్పించలేక పోయారా అని ఆశ్చర్యం కలుగుతుంది. కారణం ఆర్థిక పరమైనది కాదు. అర్హతని ఆహ్వానించని సంస్థల వైఖరి, అడుగడుగునా అడ్డుపడే అర్హత లేని అధికారుల ఆగడాలు. ఇంకా చెబితే, ఎప్పుడూ కార్య కారణ సంబంధం వెతికే ప్రయత్నం చేయని పాలకుల నైజం. "మేథో వలస కాదు, డాలర్ బ్యాంక్" అన్నాడు ఎప్పుడో ఒక పెద్ద మనిషి. ఇది గర్హనీయమైనా జాతి ఆలోచనకి తార్కాణం. వలస వీసాల పరిమితిని అమెరికా తగ్గిస్తే భారత ప్రభుత్వం, భారత "మేథో ఎగుమతి" సంస్థలు చేసే ఆగడం అంతా ఇంతా ఉండదు. ఈ విషయం లో మాత్రం 'దేశీయ గర్వం' వెనకంజ వేస్తుంది.

యువకులు ఎక్కువగా ఉన్న దేశాలలో భారత దేశం ప్రపంచంలో ముందు స్థానాలలో ఉంది. యువకుల ఆశలకి, ఆకాంక్షలకి అనుగుణంగా విధానాలు రూపొందించ వలసిన అవసరం ఉంది. భారత దేశంలో పట్టాలు పొందే వారిలో సగానికి పైగా ఉద్యోగార్హత లేనివారని తేలుతోంది. వృత్తి నైపుణ్యం ఉన్నా ప్రవృత్తి నైపుణ్యం (soft skills) లేని వారు ఎంతో మంది నిరుద్యోగులుగా మిగిలిపోతున్నారు. చేపట్టిన పనిని సకాలంలో సాకులు చెప్పకుండా పూర్తిచేయలేక పోవడం, మాట్లాడడం రాకపోవడం, భావవ్యక్తీకరణ సామర్థ్యం లేకపోవడం, ఎదుటి వారితో అనుసంధానం కాలేక పోవడం, కలిసిమెలిసి సమష్టిగా పనిచేయలేక పోవడం, సమస్యలు సుహృద్భావ ధోరణిలో ఇచ్చి పుచ్చుకునే పద్ధతిలో పరిష్కరించుకునే నేర్పు లేకపోవడం, ఎదుటి వారి సమస్యల పట్ల సానుభూతి చూపలేక పోవడం లాంటి మౌలిక ప్రవృత్తి నైపుణ్య లేమి భారతీయులలో ఎక్కువగా కనపడుతుంది. అంతకు మించి, పరిస్థితులకు తగినట్టుగా మారలేని భేషజం మన స్వంతం. ఈ ప్రవృత్తి నైపుణ్య అభివృద్ధికి యువతకి శిక్షణ ఇవ్వవలసిన ఆవశ్యకత చాలా ఉంది.

చైనాతో తలపడడాలంటే ఆశతో పాటు, వాస్తవిక పరిస్థితుల ఆధారంగా రూపొందించబడిన ప్రణాళిక చాలా అవసరం. నినాదాలు, వాగ్దానాలు దేశంలోని కొంతమందిని ఆకట్టుకుని ఆకర్షించవచ్చు కానీ అంతర్జాతీయ రంగంలో పోటీని ఎదుర్కోగల వ్యూహాలు మాత్రం కావాలవు. రాబోయే దశాబ్దంలో భారత దేశం మరింత అభివృద్ధి చెంది ప్రగతి మార్గం లో ప్రయాణించాలని నా ఆకాంక్ష.



**ఆచార్య కొవ్వలి గోపాలకృష్ణ**
ప్రధాన సంపాదకులు

"ఇంత సాధించినా సాధించ గలిగినది సాధించలేదేమో అని అనిపిస్తుంది. ఎంతోమంది శాస్త్ర వేత్తలని తయారు చేస్తున్నాం. ఎన్నో శాస్త్ర విజ్ఞాన కేంద్రాలని స్థాపించాం. కానీ, ప్రపంచ స్థాయి పరిశోధనలు గాని, శాస్త్ర విజ్ఞాన అవధులని విస్తృత పరచగల ఆవిష్కరణలు గానీ జరగలేదు."

# ముఖచిత్రం




## శ్రీ కొవ్వలి లక్ష్మీనరసింహారావు

# లోపల

విశిష్ట వ్యాసం



# ఎక్కడున్నాం మనం?



-ఎ.కృష్ణారావు
(సీనియర్ జర్నలిస్టు, ఢిల్లీ)
98102 23863

స్వాతంత్ర్యం తర్వాత మన భారత దేశం ఎలా ఉండాలి? అన్న ప్రశ్నకు జవాబుకు సుదీర్ఘమైన చర్చ మన రాజ్యాంగ నిర్మాతలే చేశారు. రాజ్యాంగాన్ని రచించకముందు మన భారత దేశం గురించి తొలి ప్రధాని జవహర్ లాల్ నెహ్రూ ఎలాంటి కలలు కన్నారు అన్న ప్రశ్నకు ఆయన స్వాతంత్ర్యం ప్రకటించిన అర్ధరాత్రి రోజు పార్లమెంట్ సెంట్రల్ హాలులో రాజ్యాంగ అసెంబ్లీ నుద్దేశించి చేసిన ప్రసంగం (tryst with destiny) లోనే జవాబులు ఉన్నాయి. భవిష్యత్ మన వైపు సంకేతాలనిస్తోంది. “ఎక్కడకు మనం వెళ్లాలి? ఏది మనం సాధించాలి? మనం సామాన్య మానవుడికి, రైతులకు, శ్రామికులకు స్వేచ్ఛ, అవకాశాలను కల్పించాలి. పేదరికాన్ని, అజ్ఞానం, అనారోగ్యాన్ని తుదముట్టించాలి. సుసంపన్నమైన, ప్రజాస్వామికమైన ప్రగతిశీలకమైన దేశాన్ని నిర్మించాలి. స్త్రీపురుషులందరికీ స్వేచ్ఛ, జీవన పరిపూర్ణత కల్పించే సామాజిక, ఆర్థిక, రాజకీయ సంస్థలను నిర్మించాలి..” అని ఆయన అన్నారు. అంతే కాదు, ‘మనం మతతత్వ వాదాన్ని కానీ, సంకుచితత్వాన్ని కానీ ప్రోత్సహించలేం. ఆచరణలో కానీ, ఆలోచనలో కానీ ప్రజలు సంకుచితంగా ఉన్న ఏ దేశమూ మహోన్నతం కాలేదు..’ అని అన్నారు.

దాదాపు 74 ఏళ్ల తర్వాత ఈ ప్రసంగాన్ని మనం అధ్యయనం చేస్తే నెహ్రూ ఆశించిన ఫలితాల్లో ఏమైనా మనం సాధించామా? సామాన్య మానవుడికి, రైతులకు, శ్రామికులకు ఆయన కావాలనుకున్న స్వేచ్ఛ, అవకాశాలు లభించాయా? పేదరికం, అనారోగ్యం, అమాయకత్వం రూపుమాపగలిగామా? ఆయన ఆశించిన విధంగా ప్రజాస్వామికమైన, ప్రగతిశీలకమైన దేశాన్ని కానీ, బలమైన సామాజిక, ఆర్థిక, రాజకీయ సంస్థలను కానీ నిర్మించగలిగామా? మన దేశంలో మతతత్వం, సంకుచితం ప్రబలిందా లేక తగ్గిపోయిందా? అన్న ప్రశ్నలకు మనం వాస్తవ దృక్పథంలో జవాబులను వెతకడం అంత కష్టం కాదు.



పేదరికం విషయానికి వస్తే, 1951-52లో జాతీయ సాంపిల్ సర్వే తొలి ఏడాది జరిపిన సర్వేలో భారత దేశంలో పేదరికం 45 శాతం ఉన్నదని తేల్చింది. 1983 వరకూ ఈ పేదరికం 43 శాతం మేరకు కొనసాగింది. ఆ తర్వాత క్రమంగా పడిపోతూ వచ్చింది. 2011 తర్వాత భారత దేశంలో పేదల సంఖ్యను లెక్కించడం మానేశారు. కాని 2019లో భారత దేశంలో 26 శాతం పేదరికం ఉన్నదని ఐక్యరాజ్యసమితి తేల్చింది. 2006-2016 మధ్య 27 కోట్లమందిని పేదరికం నుంచి మనం తప్పించగలిగామని అంతర్జాతీయ పేదరిక సూచిక (గ్లోబల్ మల్టీడైమన్షనల్ పావర్టీ ఇండెక్స్) తెలిపింది. కాని కరోనా మహమ్మారి తొలి ప్రభంజన సమయంలో మళ్లీ పరిస్థితి మొదటికి వచ్చింది. కేవలం ఒక్క ఏడాదిలోనే రోజుకు 2 డాలర్ల కంటే తక్కువ ఆదాయం ఉన్న వారి సంఖ్య 6 కోట్లనుంచి 13 కోట్లకు పెరిగింది. 136 కోట్లమంది ఉన్న భారత దేశంలో 80 కోట్ల మందికి ఉచితంగా ఆహార ధాన్యాలు సరఫరా చేస్తున్నామని ప్రధానమంత్రి నరేంద్రమోదీ ఇటీవల చేసిన ప్రకటనను చూస్తేనే దేశంలో ప్రజలు తిండికి కూడా ఎంత నోచుకోలేకపోతున్నారో అర్థమవుతుంది. ఆక్స్ ఫామ్ నివేదిక ప్రకారం భారతదేశ సంపదలో 58 శాతం సంపదను కేవలం ఒక శాతం ఉన్న ధనికులు అనుభవిస్తున్నారు. 77శాతం కుటుంబాల్లో ప్రతి నెలా ఆర్జించే సభ్యుడు లేరు. 67 శాతం కుటుంబాలకు నెలకు రూ. 10 వేల కంటే తక్కువఆదాయంతో బతుకుతున్నారు.

పేదరికం మాత్రమే కాదు, ఆకలి, పోషకాహారం, మంచి ఆరోగ్యం, నాణ్యమైన విద్య, లింగ సమానత్వం, స్వచ్ఛమైన, భరించదగ్గ ఇంధనం, ఉపాధి కల్పన, ఆర్థిక ప్రగతి, పరిశ్రమలు, వినూత్న ఆవిష్కారాలు, మౌలిక సదుపాయాలు మొదలైన ఐక్యరాజ్యసమితి నిర్ణయించిన స్థిరమైన అభివృద్ధి లక్ష్యాల (ఎస్ డిజి)ల విషయంలో కూడా భారత దేశం చాలా దేశాలతో పోలిస్తే వెనుకబడి ఉన్నదనే తేలింది. 2021లో విడుదల చేసిన 'స్టేట్ ఆఫ్ ఇండియా ఎన్విరాన్ మెంట్' రిపోర్ట్

ప్రకారం భారత దేశం ర్యాంకు గత ఏడాది తో పోలిస్తే రెండు పాయింట్లు అంటే 115 నుంచి 117కు పెరిగింది. భూటాన్, నేపాల్, శ్రీలంక, బంగ్లాదేశ్ లు భారత దేశం కంటే ఎక్కువ ర్యాంకు సంపాదించాయి. ఆకలిని నిర్మూలించడం, ఆహార భద్రత వంటి విషయాల్లో మనం సవాళ్లను ఎదుర్కొంటున్నామని ఈ నివేదిక స్పష్టం చేసింది. జాతీయ క్రైమ్ రికార్డ్స్ బ్యూరో గణాంకవివరాల ప్రకారమే ఉపాధి లేమి, పేదరికం వల్ల 2019లో 14 శాతం మంది ఆత్యహత్య చేసుకున్నారని, సగటున రోజుకు 10 మంది మరణిస్తున్నారని తేలింది. 2019లోనే కనీసం 10,281 మంది రైతులు ఆత్యహత్య చేసుకున్నారని ఈ నివేదిక తేల్చింది.

అక్షరాస్యత విషయంలో భారత దేశం మంచి ఫలితాలనే సాధించింది. స్వాతంత్ర్యం వచ్చినప్పుడు భారత దేశంలో అక్షరాస్యత కేవలం 12 శాతమే. కాని ఇప్పుడు అది 74 శాతానికి పెరిగింది. కాని ఈ అక్షరాస్యత మన దేశంలో ఉపాధి పొందేందుకు, ఉత్పాదకత పెంచేందుకు, ఆర్థికా భివృద్ధి సాధించేందుకు తోడ్పడుతున్నదా లేక కేవలం అక్షరాలు తెలిసిన జనాన్ని సృష్టించేందుకు మాత్రమే ఉపయోగపడుతుందా అన్న విషయం చర్చించుకోవాల్సి ఉన్నది. పాఠశాలల్లో నమోదు, విద్యాసంస్థల సంఖ్య పెరగడం జరిగింది. కాని దేశంలో 40 శాతం పిల్లలు ఎలమెంటరీ స్థాయిలోనే పాఠశాలను వదిలేస్తారు. బాలికల్లో 63.5 శాతం మధ్యలోనే చదువును మానేస్తారు. విద్యార్థులు-టీచర్ల నిష్పత్తి అధ్వాన్నంగా ఉండడం, పాఠశాలల్లో సరైన మౌలికసదుపాయాలు, శౌచాలయాలు లేకపోవడం కనిస్తుంది, మన విద్యాసంస్థల ప్రమాణాలు కూడా ప్రశ్నార్థకం. అంతర్జాతీయ విద్యార్థులను ఆకర్షించగల, అంతర్జాతీయ ప్రమాణాలున్న యూనివర్సిటీలను, విద్య పూర్తి కాగానే ఉపాధి కల్పన దిశగా మార్గదర్శకత్వం అందించగల విద్యాలయాలను మన దేశంలో వెదుక్కోవాల్సి ఉన్నది. అందుకే ప్రతి ఏడాది వేలాది మంది విద్యార్థులు పై చదువులకోసం అమెరికా, యూరప్ దేశాలకు వెళ్లాల్సి వస్తుంది.

అంతర్జాతీయ ఆహార ధాన్యాలసహాయంపై ఆధారపడకపోవడం, ఆహారోత్పత్తిలో స్వయం సమృద్ధి సాధించడం, అనేక ఆహారోత్పత్తులను ఉత్పత్తి చేయడంలో మనం ప్రపంచంలో అగ్రస్థానంలో ఉండడం మంచి పరిణామమే. కాని 1947లో భారత దేశ జీడీపిలో వ్యవసాయం వాటా 54 శాతంకాగా ఇంకా 52 శాతం వ్యవసాయంపై ఆధారపడి జీవిస్తున్నారు. భూమి స్థిరంగా ఉంటుంది. భూసారం స్థిరంగా ఉండదు. జలవనరులు స్థిరంగా ఉండవు. జనాభా కూడా

స్థిరంగా ఉండదు. పెరుగుతున్న జనాభాకు తగ్గట్లుగా ప్రజలకు వ్యవసాయేతర రంగాల్లోను, పట్టణాల్లోనూ సరైన ఉపాధి కల్పించడంలో ప్రభుత్వాలు విఫలమవుతున్నట్లు స్పష్టమవుతోంది. గత ఏడాది కరోనా సమయంలోలాక్ డౌన్ విధించినప్పుడు లక్షలాది వలస కార్మికులు మైళ్లకు మైళ్లు నడుచుకుంటూ తమ గ్రామాలవైపు పయనం సాగించిన దృశ్యాలు మనకు తెలుసు.

> 2015 స్వాతంత్ర్యదిన ప్రసంగంలో ప్రధానమంత్రి మన దేశం లో నూటికి నూరు శాతం విద్యుదీకరణ సాధించామని చెప్పుకున్నారు. కాని ఇది పూర్తిగా వాస్తవంకాదు. ఇప్పటికీ వందలాది గ్రామాలకు విద్యుత్ సౌకర్యం లేదు.

2015 స్వాతంత్ర్యదిన ప్రసంగంలో ప్రధానమంత్రి మన దేశం లో నూటికి నూరు శాతం విద్యుదీకరణ సాధించామని చెప్పుకున్నారు. కాని ఇది పూర్తిగా వాస్తవంకాదు. ఇప్పటికీ వందలాది గ్రామాలకు విద్యుత్ సౌకర్యం లేదు. ప్రధానమంత్రి ఈ ప్రకటన తర్వాత ఉత్తర ప్రదేశ్, తమిళనాడు, ఒడిషా, బీహార్ తో పాటు అనేక రాష్ట్రాలనుంచి తమ గ్రామాల్లో విద్యుత్ సౌకర్యం లేదని, కనీసం విద్యుత్ సౌకర్యాలను కూడా ఏర్పర్చలేదని వార్తాకథనాలు వచ్చాయి.

రహదారుల విషయంలో భారతదేశంలో మౌలిక సదుపాయాల కల్పన వేగంగా జరుగుతున్న విషయం కాదనలేము. జాతీయ రహదారులతో పాటు రాష్ట్ర రహదారులు, జిల్లారహదారులు అభివృద్ధి చెందుతున్నాయి. కాని వాటి నాణ్యత చాలా చోట్ల ఘోరంగా ఉంటుంది. ఒక్క వర్షం వస్తే చాలు, ముంబై, చెన్నై, హైదరాబాద్ తో పాటు అనేక నగరాల్లో రోడ్లు కొట్టుకుపోయి జలమయమైపోతాయి. కేవలం 56 శాతం పట్టణాలకే సరైన మురికినీటి పారుదల వ్యవస్థలు ఉన్నాయి. 80 శాతం మురికినీరు నదుల్లో, చెరువుల్లో కలిసిపోతుంది. భారత దేశంలో సగం మందికి సురక్షితమైన, త్రాగునీరు లభించడంలేదని యునిసెఫ్ అధ్యయనంలో తేలింది. నీరు, పారిశుధ్యం విషయంలో భారత దేశ

పరిస్థితి చాల ఘోరంగా ఉన్నదని, 26 శాతం ప్రజలకు సరైన పారిశుధ్య వసతులు లేవని అంతర్జాతీయసంస్థల నివేదికలు చదివితే అర్థమవుతుంది. స్వచ్ఛభారత్ వంటి పథకాలు ఎన్ని ప్రవేశపెట్టినప్పటికీ గ్రామాల్లో 52 శాతం ఇంకా బహిరంగ విసర్జన చేయడం, పట్టణాల్లో మురికి వాడల్లో పారిశుధ్య వసతులు లేకపోవడం కనిపిస్తుంది.

అంతరిక్ష రంగంలో భారత దేశం అనేక విజయాలు సాధించిందనడానికి చంద్రయాన్ వంటి ప్రయోగాలే నిదర్శనం. పివి హయాంలో ఆర్థిక సంస్కరణలు చేపట్టిన ఫలితంగా ఆటోమోటివ్ రంగం, ఇంజనీరింగ్, ఎలెక్ట్రికల్, ఐటీ, టెలికమ్యూనికేషన్, ఫార్మస్యూటికల్ రంగాల్లోనూ అంతర్జాతీయ బహుళ జాతి సంస్థలను ఆకర్షించగలిగాం. పౌరవిమాన యాన శాఖ కూడా చెప్పుకోదగ్గ విధంగా అభివృద్ధి సాధించాం. జల, థర్మల్ అణు విద్యుత్ రంగాల్లో విద్యుదుత్పాదన పెరిగిన మాట వాస్తవమే. ఐటీ సేవల ఎగుమతిలో మనం అగ్ర స్థానంలో ఉన్నాం.. 31 శాతం ఉద్యోగాలు సేవల రంగంలో లభిస్తున్నాయి. జీడీపీలో 54 శాతం సేవల రంగం నుంచే లభిస్తుంది. కాని 2019లో ఆర్థిక సర్వే ప్రకారం మౌలిక సదుపాయాల రంగంలో పెట్టుబడులు అవసరమైన దానికంటే 27 శాతం తక్కువున్నాయని తేల్చింది. చైనా కార్మిక ఉపాధికి తగ్గ పరిశ్రమలను చేపడితే భారత దేశం భారీ పరిశ్రమల దిశగా మళ్లింది. దీని వల్ల లక్షలాది మందికి ఉపాధి కల్పించలేకపోయాం. పారిశ్రామికాభివృద్ధి జరగకపోగా, మౌలిక సదుపాయాలు, ఆరోగ్యం, ఇతర నిత్యావసర రంగాలకు అవసరమైన పెట్టుబడులను సమీకరించలేకపోయాం.



ఆరోగ్య రంగంలో కూడా మంచి ఫలితాలనే మనం సాధించాం. అనేక దేశాల కంటే తక్కువ ఖర్చులో భారత్ లో వైద్యం లభిస్తుంది. మాతృ, శిశు మరణాల రేటు కూడా తగ్గిపోయింది. అయినప్పటికీ పోషకాహారలోపాల వల్ల 39 శాతం శిశువులు తక్కువ బరువుతో జన్మిస్తున్నారని, మూడోవంతు మహిళలు శక్తిహీనంగా ఉన్నారని తేలింది. పోలియో లేని దేశంగా ప్రకటించుకోగలిగాం. కాని భారత దేశంలో ప్రజా ఆరోగ్యానికి కేవలం 3.89 శాతమే ఖర్చుపెడుతున్నారు. గ్రామీణ రంగంలో, జిల్లాల్లో వైద్యవసతులు

ఎంత ఘోరంగా ఉన్నాయో వైద్య సిబ్బంది కొరత తీవ్రత ఎంత ఉన్నదో ఇటీవల కరోనా మహమ్మారి బహిర్గతం చేసింది. వేలాది మంది పడకలు దొరకక, ఆక్సిజన్ లభ్యం కాక మరణించారు. శ్మశానాలు శవాలతో నిండిపోగా ఉత్తర ప్రదేశ్ వంటి రాష్ట్రాల్లో శవాలను గంగానదిలో విసిరివేసిన వైనం పత్రికలకు ఎక్కింది.

భారత రాజ్యాంగం విషయానికి వస్తే చట్టం ముందు అందరూ సమానులేనని రాజ్యాంగంలోని 14వ అధికరణ, మత, జాతి, కులం, లింగ, జన్మస్థలం ఆధారంగా వివక్షను పాటించకూడదని 15వ అధికరణ, భావ ప్రకటనా స్వేచ్ఛ, వాక్ స్వాతంత్ర్యం కల్పించిన 19వ అధికరణ, జీవించే హక్కు కల్పించిన 21వ అధికరణ, అందరికీ సమాన న్యాయం, ప్రాథమిక హక్కులకు భంగం కలిగితే నేరుగా ఉన్నత న్యాయస్థానం తలుపు తట్టే అధికారం కల్పించిన 32వ అధికరణ, ఉచిత న్యాయం కల్పించిన 39 ఏ అధికరణ ఆచరణలో నిరర్థకంగా మారాయని ఏడు దశాబ్దాల కాలంలో జరిగిన అనేక సంఘటనలు రుజువు చేస్తాయి. సిక్కులు, మైనారిటీల ఊచకోత, మత కల్లోలాలు, ఎమర్జెన్సీ, దళితులు, స్త్రీలపై అత్యాచారాలు వంటి అనేక ఘటనలు రాజ్యాంగంలోని డొల్లతనాన్ని నిరూపించాయి. ప్రభుత్వాన్ని ప్రశ్నించిన వారిపై, మీడియాపై రాజద్రోహ నేరాలతో పాటు, జాతీయ భద్రతా చట్టం, ఉగ్రవాద నిరోధక చట్టాలను మోపడం, ఆదివాసీలు, రచయితలు, మానవహక్కుల కార్యకర్తలను ఏళ్ల తరబడి విచారణ లేకుండా జైళ్లలో బంధించడం, పోలీసు వ్యవస్థ అత్యధికంగా అధికారంలో ఉన్నవారికి, సంపన్నులకు దాసోహం కావడం, సిబిఐ, ఎన్ ఐఏ వంటి సంస్థల్ని రాజకీయ ప్రయోజనాలకు ఉపయోగించుకోవడం భారత దేశంలో ప్రజాస్వామ్యం అమలులో ఉన్నదా అన్న ప్రశ్నలకు ఆస్కారం కలిగిస్తున్నాయి.

రాత్రిపూట స్త్రీలు స్వేచ్ఛగా నడిచే రోజే మనకు స్వాతంత్ర్యం వచ్చినట్లు లెక్క అని మహాత్మాగాంధీ అన్నారు. కాని పగటి పూట కూడా స్త్రీలు ఇంకా స్వేచ్ఛగా రహదారులపై నడిచే పరిస్థితి లేదు. జాతీయ నేరాల రికార్డు బ్యూరో ప్రకారం ప్రతి ఏటా దేశంలో 35 వేలమంది స్త్రీలపై అత్యాచారాలు జరుగుతున్నాయి. దలిత స్త్రీల పరిస్థితి వర్ణనాతీతం.

భారత దేశంలో న్యాయవ్యవస్థ ఒక్కటే ప్రజల అవసరాలకు తగ్గట్లు స్పందిస్తున్నట్లు అప్పుడప్పుడు కనిపిస్తున్నప్పటికీ అది ప్రజలకు అందుబాటులో లేదు. 2.18 కోట్ల కేసులు పెండింగ్ లో ఉన్నాయి, ఈ కేసులను పరిష్కరించాలంటే భారత దేశానికి 70వేలమంది న్యాయమూర్తులు అవసరమని ప్రధాన న్యాయమూర్తిగా పనిచేసిన జస్టిస్ ఠాకూర్ ఒక సందర్భంలో అన్నారు.

న్యాయవ్యవస్థ గురించి స్వాతంత్ర్య పూర్వం గురజాడ అప్పారావు, స్వాతంత్ర్యం తర్వాత రావిశాస్త్రి రచించిన తీరుకూ నేటి పరిస్థితికీ పెద్దగా మార్పు లేదు.

> స్వాతంత్ర్యం వచ్చి ఏడు దశాబ్దాలు గడిచిన తర్వాత చూస్తే మన ప్రజాస్వామ్యం, ఎన్నికల వ్యవస్థ కుళ్లిపోయినట్లు కనిపిస్తోంది. సరైన వారిని ఎన్నుకోవడంలో ప్రజలు విఫలమయ్యారా అన్న ప్రశ్న తలెత్తుతుంది. నేరస్తులు, అవినీతిపరులు, నరహంతకులు అధికార పీఠాన్నెక్కడం చూస్తే ప్రజలు తమ అర్హత ప్రకారమే ప్రభుత్వాన్ని ఎన్నుకుంటారని ప్రముఖ తత్వవేత్త జార్జి బెర్నార్డ్ షా అన్న మాటలు నిజమేనేమో అనిపిస్తుంది.

స్వాతంత్ర్యం వచ్చి ఏడు దశాబ్దాలు గడిచిన తర్వాత చూస్తే మన ప్రజాస్వామ్యం, ఎన్నికల వ్యవస్థ కుళ్లిపోయినట్లు కనిపిస్తోంది. సరైన వారిని ఎన్నుకోవడంలో ప్రజలు విఫలమయ్యారా అన్న ప్రశ్న తలెత్తుతుంది. నేరస్తులు, అవినీతిపరులు, నరహంతకులు అధికార పీఠాన్నెక్కడం చూస్తే ప్రజలు తమ అర్హత ప్రకారమే ప్రభుత్వాన్ని ఎన్నుకుంటారని ప్రముఖ తత్వవేత్త జార్జి బెర్నార్డ్ షా అన్న మాటలు నిజమేనేమో అనిపిస్తుంది. ఎన్నికల క్రమం స్వచ్ఛత, నిజాయితీపైనే ప్రజాస్వామిక సంస్థల ప్రయోజనం, ప్రజాస్వామ్య నాణ్యత ఆధారపడి ఉంటాయి.అక్రమ సంపదను రాజకీయ హోదాకోసం, రాజకీయాలను అక్రమ సంపదకోసం వినియోగించుకోవడం సాధారణమైపోయింది. 2019 సార్వత్రిక ఎన్నికల్లో రూ. 30 వేల కోట్లకు పైగా ధనం ఎన్నికల రాజకీయాల్లో ప్రవహించిందని ఒక అంచనా. ధన శక్తి ప్రజాస్వామ్యాన్ని కలుషితం చేసిందని సుప్రీంకోర్టు మాజీ న్యాయమూర్తి జస్టిస్ వెంకటాచలయ్య ఇటీవల జస్టిస్ రవీంద్రన్ రాసిన ఒక పుస్తకానికి రాసిన ముందుమాటలో ఆవేదన వ్యక్తం చేశారు. ఎక్కడున్నాం మనం?

# జనం, బుధ జనం
# మెచ్చిన నవలాకారుడు

ప్రతి నవలా ఒక నవలే (స్త్రీ) అయితే,
సహస్ర గోపికా పరివేష్టితుడై రాసకేళి
సలిపే గోపాలుడు మా కొవ్వలి!

~ దాశరథి

గుడిపాటి వెంకటాచలం
(చలం) ప్రభావం
తెలుగు నవలపైన
ఎంతఉందో చెప్పడానికి
మొట్టమొదటగా
ఉదాహరించాల్సిన
నవలలు కొవ్వలి వారివే

~ ఆర్ ఎస్ సుదర్శనం



ఆ రోజుల్లో కొవ్వలి
తమ కౌగిలిలో లేని
ఆడపిల్లలుండేవారు
కాదు. ఆ అదృష్టం
అందరికీ
పడుతుందా!"

~ గుడిపాటి వెంకట చలం

కల్పనా సాహిత్యం
గ్రాంథిక భాష నుంచి
వ్యావహారిక భాషాశైలికి
మారిన ఘట్టంలో
గణనీయమైన దోహదం
చేసిన రచనలుగా
కొవ్వలి నవలలను
గుర్తించాలి

~ మధురాంతకం రాజారాం

తెలుగుదేశములో మొట్టమొదటగా
జనబాహుళ్యం కోసం, అందులోనూ
మధ్యతరగతి స్త్రీలకు అమోదకరమైన
రీతిలో ఈ విధంగా రచనలు చేసిన వారు
శ్రీ కొవ్వలి.

~ ప్రముఖ దర్శకులు, రచయిత శ్రీ చక్రపాణి

దృక్కోణం

# ప్రతిభా త్రయం



ఆచార్య గోపాలకృష్ణ కొవ్వలి

ఒకరు ఆధునిక తెలుగు నవలా ప్రపంచాన్ని ఒక మలుపు తిప్పి, ఒక ఊపు ఊపిన వారు. ఒకరు, తెలుగు కథకి అంతర్జాతీయ గుర్తింపు తేవడంతోపాటు కథామతల్లికి ఇల్లు కట్టిన వారు. ఇంకొకరు అందాలకి రంగుల వలువలు కప్పి, 'బొమ్మ అంటే ఇది' అనేలా బొమ్మలు చిత్రించి తెలుగు ప్రజల మనసుల్లో ముద్ర వేసిన వారు. ప్రకాశిక జూలై-సెప్టెంబర్ సంచికలో ఈ ప్రతిభా త్రయాన్ని, వారి వారసత్వాన్ని గుర్తు చేసుకోవడం విశేషం. ఈ ముగ్గురి వ్యక్తిత్వాలలోనూ ఒక సామ్యం ఉంది. ముగ్గురూ నిరహంకార, ప్రకటన, ప్రచారార్భాట రహిత సుమనస్కులు.

వడ్డాది పాపయ్య గారి శత జయంతి సంవత్సరం ఇది. కొవ్వలి లక్ష్మీ నరసింహారావు గారు భౌతికంగా దూరం అయి 46 సంవత్సరాలు అయింది. కారా మాష్టారు కథానిలయాన్ని వదిలి సుమారు రెండు నెలలు కావస్తోంది. ఈ ముగ్గురూ వారి వారి రంగాలలో ఉన్నత శిఖరాలకి చేరుకుని ఎంతో మందిని ప్రభావితం చేశారు, చేస్తున్నారు. వపా గారు విలక్షణమైన రంగుల కలయికతో కూడిన బొమ్మలు వేయడం ద్వారా పేరు ప్రఖ్యాతలు గడించారు. అయినా సన్మానాలకి, శాలువాలకి దూరంగా గడిపిన నిగర్వి. ఇక కారా మాష్టారు ఎన్నో కథలు రాసి, కథకే చిరునామాగా మారి అంతర్జాతీయ కీర్తి సంపాదించినా అంతర్ముఖి గానే కాలం గడిపారు. తన జీవిత కాలంలోనే తాను సమాజం మీద వేసిన ముద్ర ప్రభావాన్ని చూడగలిగారు.

కొవ్వలి విషయంలో, ఆయన జీవించి ఉన్న కాలంలో ఆయనకి రావలసిన గుర్తింపు రాలేదేమో అని అనిపిస్తుంది. ఆయన రాసిన కథల ఆధారంగా తీసిన సినిమాలు, ఆయన మాటలు రాసిన సినిమాలు విజయం సాధించినా, ఆయన "సెలబ్రిటీ" గా గుర్తించబడలేదు. బహుశా ఆయనకి ప్రచార లేమి, నిరాడంబరత కారణం కావచ్చు.

> కొవ్వలి నవలల విషయానికి వస్తే, జనం మెచ్చడం, ఎక్కువ మంది చదవడం వంటి విషయాలు పక్కన పెడితే ఆయనకి ప్రభావశీల నవలాకారుడిగా రావలసిన గుర్తింపు రాలేదనే చెప్పాలి.

కొవ్వలి నవలల విషయానికి వస్తే, జనం మెచ్చడం, ఎక్కువ మంది చదవడం వంటి విషయాలు పక్కన పెడితే ఆయనకి ప్రభావశీల నవలాకారుడిగా రావలసిన గుర్తింపు రాలేదనే చెప్పాలి. దీనికి కారణం ఆయనది 'రైల్వే సాహిత్యం' అని, ఆ పుస్తకాలు చదివితే పాడయిపోతారని కొంతమంది పనిగట్టుకుని చేసిన దుష్ప్రచారం ఎక్కువనిపిస్తుంది. అదృష్టవశాత్తు కొవ్వలి నవలలు 'స్వాతి' వారపత్రికలో 1980 ప్రాంతంలో సచిత్ర ధారావాహికగా రావడంతో 'రైల్వే సాహిత్యం' ప్రధాన సాహిత్య స్రవంతి లోకి వచ్చింది. స్వాతి ముత్యంలా కొవ్వలి సాహిత్యం ప్రపంచంలోకి విస్తరించింది.

కొవ్వలి రాసిన చాలా నవలలు సామాజిక స్పృహతోనూ, సామాజిక రుగ్మతలని ఎత్తి చూపుతోనూ రాసినవైనా ఆయనకి సంఘ సంస్కరణాభిలాషిగా గుర్తింపు రాలేదు. ఒక చోట మా శర్మ గారు రాసినట్లు "వరకట్న బాధలు, అత్తగారి హింసలు, సవతి తల్లి పెట్టే బాధలు, వంచకుల కపట నాటకాలు, నిరుద్యోగుల యాతనలు, దగాకు గురైన అతివల దీనగాథలు, సంప్రదాయం మాటున చాదస్తాలు, నాగరికత ముసుగులో కుసంస్కారాలు.. ఇట్లా ఎన్నో సమకాలీన అంశాలకు దర్పణాలుగా ఆ నవలలు నిలిచేవి". కొవ్వలి రచనలపై గురజాడ, కందుకూరి లాంటి సంస్కర్తల ప్రభావం తప్పకుండా ఉండి ఉండాలి. ఆయన రచనలలోని పాత్రలు, కథాంశాలు ఈ విషయాన్ని ప్రస్ఫుటం చేస్తాయి. అలాగే, ఆయన ప్రభావం కూడా తరవాత వచ్చిన రచయితల మీద ఉండి ఉంటుంది. వాస్తవానికి, 'కొవ్వలి వారి నవలలు చదువుతూ నా తల్లిదండ్రులు కన్నీళ్లు పెట్టుకునేవారు. అది చూసి నేను ఆశ్చర్యపోయి.. ఆ నవలలు చదవడం ప్రారంభించాను. ఈ క్రమంలో కొవ్వలి వారి రచనలే నన్ను రచయితగా మార్చేందుకు బాటలు వేశాయి' అని కారా మాస్టారే స్వయంగా చెప్పుకున్నారు.

కొవ్వలి రాసే వ్యావహారిక భాషని గ్రాంథిక భాషా వాదులు క్రమంగా గుర్తించినా, ఆయన నవలలలో ఆవిష్కరించిన అభ్యుదయ భావాలని

ఛాందసులు ఆదరించలేకపోయారు. కారణం కొవ్వలి "కనీసం ఒక అర్ధ శతాబ్దం ముందుగా పుట్టడమే". పెళ్లి కాని స్త్రీ-పురుషుల సహజీవనం, వితంతు వివాహం వంటి అంశాలు ఆయన రచనలలో ప్రస్తావించారు. ఆ విషయాలు ఆ కాలానికి "పిదప కాలం బుద్ధులు" గా తోచేవి.

కొవ్వలి రాజకీయ చైతన్యం, సునిశిత పరిశీలనా శక్తి 'పండగ మామూలు' అనే నవలలో కనపడుతుంది. ఈ నవల 1937 లో రాసినది. అంటే భారత దేశానికి 'దాస్య విముక్తి' కలగడానికి 10 సంవత్సరాలకి పూర్వం అన్నమాట! ఈ నవల రాజకీయ నేపథ్యంలో, ఎన్నికల భూమికలో నడుస్తూనే సమాంతరంగా సాగే ఒక ప్రణయ గాథ. ఈ నవల చదువుతూంటే, ఎప్పుడు రాశారో చెప్పకపోతే 2021 లో రాసిన నవలలా అనిపిస్తుంది. ఎన్నికలు, ప్రచారాలు, ఓట్లు, ఓట్ల బ్యాంక్లు, వెన్నుపోట్లు, కాంగ్రెస్ పార్టీ రాజకీయాలు అన్నీ ఈ నవలలో కనిపిస్తాయి. అంటే, మనమేదో కొత్తగా పాడయిపోయినది ఏమీ లేదన్న మాట! స్వాతంత్ర్యం రాక ముందే మన ఎన్నికల రాజకీయం భ్రష్టు పట్టినదని ఈ నవల చదివితే తెలుస్తుంది. కాకతాళీయమో, ఉద్దేశ పూర్వకమో తెలియదు కానీ ఈ నవలలో ఎన్నికల బరిలో ఉన్న కాంగ్రెస్ నాయకుడి పేరు గోపాల రావు. జస్టిస్ పార్టీ తరపు ప్రత్యర్థి నాయుడు గారు. మా పెద తాత గారు కొవ్వలి గోపాల రావు గారు జిల్లా బోర్డు ప్రెసిడెంట్ గాను, తరవాత శాసన సభకి కాంగ్రెస్ తరపున పోటీ చేసినప్పుడు ముళ్ళపూడి హరిశ్చంద్ర ప్రసాద్ గారు జస్టిస్ పార్టీ తరపున పోటీ చేసి నెగ్గారు. ఆదర్శమే ఆస్తిగా ఉన్న గోపాలరావు గారు ఆస్తిపరుడైన హరిశ్చంద్ర ప్రసాద్ 'చేతిలో' ఓడిపోయారు. కొవ్వలి 'పండగ మామూలు' రాసిన కాలానికి ఈ ఎన్నికలు జరిగాయో, తరవాత జరిగాయో తెలీదు.

కొవ్వలి నవలల కథాంశాలే కాకుండా పేర్లు కూడా విలక్షణంగా ఉంటాయి. "బడా చోర్, కిడ్నాప్, చస్తావ్ పారిపో" లాంటి నవలల పేర్లు ఈ కాలం సినిమా కథలు రాసే వాళ్ళకి ప్రేరణ కావచ్చు!

కొవ్వలి రచనల మీద ఎన్నో పరిశోధనలు చేయవచ్చు. దురదృష్టవశాత్తు గొప్పవారి గురించి, వాళ్ళని పొగుడుతూ అందరికీ తెలిసినవే రాయడానికి చూపే ఉత్సాహం, గొప్పవారు చేసిన పనులని, వాళ్ళ రచనలని విశ్లేషిస్తూ రాయడానికి ఎక్కువ మంది ఉత్సాహం చూపడం లేదు. యువకులలో పరిశోధనాత్మక, విశ్లేషణాత్మక రచనలు చేయడంపై ఆసక్తినీ, అభిరుచినీ ప్రోత్సహించడానికి ప్రకాశిక "పరిశోధనా వ్యాసాల" పోటీ నిర్వహిస్తోంది. ఆ పోటీలో భాగంగా, కొవ్వలి వారి రచనల మీద పరిశోధనా వ్యాసాలు వస్తాయని ఆశిస్తున్నాము. రాసేలా యువకులని ప్రోత్సహించమని ఆచార్యులను కోరుతున్నాము.

కొవ్వలి వంటి వాళ్ళ గురించి మాట్లాడుకొనేటప్పుడు గొప్పవాళ్ళ పట్ల భారతీయుల, ముఖ్యంగా తెలుగు వారి నిర్లక్ష్య వైఖరి ఎంత దారుణమో గోచరమవుతుంది. భారతీయులకి చారిత్రక స్పృహ తక్కువని అంగీకరించక తప్పదు. ఎన్నో విలువైన చారిత్రక కట్టడాలు శిథిలావస్థలో ఉండడం చూస్తాము. కొవ్వలి రాసిన 1,001 నవలలులో సగం కూడా లభ్యం కాకపోవడం ఎంత బాధాకరం. అంతే కాదు, ఆయన ఫోటోస్ కూడా దొరక్కపోవడం విచారకరం. ఇంకా ఎందరో గొప్ప ఆధునిక రచయితల రచనలు, ప్రాచీన గ్రంథాలూ చెదలమాటున మగ్గుతున్నాయో, చరిత్ర గతిలో కలిసిపోయాయో అన్న ఆలోచనే బాధాకరం. కొవ్వలికి పేరు తెచ్చిన సినిమా 'సిపాయి కూతురు' లాంటి చిత్రాలు ఎక్కడా దొరకడం లేదంటే ఆశ్చర్యంతో పాటు బాధ కలుగుతుంది. ఆ చిత్రంలో నటించి పేరు సంపాదించిన సత్యనారాయణ గారు ఆ సినిమా చూడాలని తపిస్తున్నారంటే అమూల్యమైన గతం పట్ల, గత విషయాల పట్ల మనకున్న అల్ప దృష్టి అర్థమవుతుంది.

> కొవ్వలి వంటి వాళ్ళ గురించి మాట్లాడుకొనేటప్పుడు గొప్పవాళ్ళ పట్ల భారతీయుల, ముఖ్యంగా తెలుగు వారి నిర్లక్ష్య వైఖరి ఎంత దారుణమో గోచరమవుతుంది. భారతీయులకి చారిత్రక స్పృహ తక్కువని అంగీకరించక తప్పదు.

ఈ సందర్భంగా, మరగున పడ్డ గురజాడ వారి చేతి రాతతో ఉన్న ఎన్నో రచనలని, ఆయన డైరీ లనీ ఎంతో శ్రమతో వెతికి వెలికి తీసి ప్రపంచానికి అందచేసిన డా. కాళిదాసు పురుషోత్తం గారికీ, కీ.శే. వేదగిరి రాంబాబు గారికి, వాళ్ళకి వనరులు అందించిన 'మనసు ఫౌండేషన్' వారికి అభినందనలు, ధన్యవాదాలు. ఇలాంటి వాళ్ళు ఎంతో మంది కావాలి.

విశేష ప్రతిభ పాటవాలు ఉన్న భారతీయులని, ముఖ్యంగా తెలుగు వారిని, వారి రంగాలలో వారు సాధించిన విషయాలని పరిచయం చేసే ప్రయత్నం చేస్తోంది ప్రకాశిక. ఈ సంచికలో కొవ్వలి వారి గురించిన వ్యాసాలు రాయించడంలో భూమిక పోషించిన వారి అబ్బాయిలు కొవ్వలి నాగేశ్వర రావు గారు, కొవ్వలి లక్ష్మీ నారాయణ గార్లకి కృతజ్ఞతలు.

# వెయ్యి నవలల రారాజు కొవ్వలి



డా॥ మండలి బుద్ధప్రసాద్
పూర్వ ఉప-సభాపతి, ఆంధ్రప్రదేశ్ శాసనసభ
98487 80872

ఒంటిచేత్తో వెయ్యికి పైగా నవలలు వ్రాసిన ఘనత దక్కించుకున్న రచయిత శ్రీ కొవ్వలి లక్ష్మీనరసింహారావు, ఆ రోజుల్లో ప్రపంచ రికార్డులు నమోదు చేసే ప్రక్రియ ఉండి ఉంటే శ్రీ కొవ్వలికి నిస్సందేహంగా ఆ రికార్డు దక్కి ఉండేది. ఒక రాత్రి నవల వ్రాయడం ప్రారంభిస్తే తెల్లవారేసరికి పూర్తిచేసి ప్రచురణ కర్తకు ఇచ్చిన ఘనుడుగా పేరు తెచ్చుకున్నాడాయన.

శ్రీ కొవ్వలి కలంపట్టిన 1935 నాటి సాంఘిక పరిస్థితులు తెలిస్తే, ఆయన తెలుగు సాహిత్యానికి చేసిన సేవ ఎంతటి మహత్తరమైనదో అవగతమౌతుంది. వ్యవహారిక భాషోద్యమానికి శ్రీ గురజాడ అప్పారావు, శ్రీ గిడుగు రామమూర్తి పంతులు నడుం కట్టిన కాలమది."ఏ భాషలో మన సుఖ-దుఃఖాలను మనం జంకు లేకుండా వ్యక్తపరుస్తామో, ఏ భాషను నేను నా తల్లి ఒడిలో నేర్చుకున్నానో ఆ సజీవమైన భాషే కావాలి" అని వాడుకభాషలో సాహిత్య సృష్టికి మహాకవి గురజాడ ద్వారాలు తెరిచారు. "నాది ప్రజా ఉద్యమం. ఎవరినీ సంతృప్తి పరచటానికి దాన్ని వదులుకోలేను" అని శ్రీ గురజాడ ప్రారంభించిన వాడుక భాషోద్యమాన్ని ముందుకు తీసుకు వెళ్ళిన గిడుగు అడుగుజాడలు శ్రీ కొవ్వలికి మార్గనిర్దేశం చేశాయి. కొవ్వలి తన నవలల ద్వారా వాడుక భాషకు వ్యాప్తి కలిగించాడు. గిడుగులాగానే కొవ్వలి కూడా ఆనాడు పండితుల నిరసనలను ఎదుర్కొన్నాడు. కానీ ఆయన లెక్కచేయకుండా సామాన్యుడి స్థాయికి తన రచనలను తీసుకువెళ్ళటానికి సరళ వ్యావహారిక భాషను చక్కగా ఉపయోగపరిచాడాయన. దీనికి ఒక సంఘటన ప్రేరణ అయ్యిందట.

ఒక ఇల్లాలు ఒక మహాకవి వ్రాసిన కావ్యంలోని పేజీ చించి, ఒక బిడ్డ మలాన్ని ఎత్తి పారేయటాన్ని చూసి, ఆవేదన చెందిన శ్రీ కొవ్వలి "అమ్మా! ఆ గ్రంథాన్ని ఎప్పుడైనా తెరిచి చూశావా" అనడిగారు. తాను దాన్ని చదవలేదని,

చదివినా అది తనకు అర్థం కాదని సమాధానం చెప్పిందావిడ. ఆమె చదవగలిగే స్థాయిలో వ్రాయగలిగితే ఆ పేజీలకు ఇలా మలప్రక్షాళనా యోగం పట్టేది కాదు కదా! అనే భావన శ్రీ కొవ్వలి మనసులో బలంగా కలిగిందా క్షణంలో! తత్ఫలితంగా జన సామాన్యం కోసం కలం పట్టిన కథలు వ్రాసేలా శ్రీ కొవ్వలి గట్టి నిర్ణయం తీసుకున్నారు.

"మాకొద్దీ తెల్లదొరతనమూ" అంటూ దేశప్రజలను ఉద్రూతలూగించిన మహత్తర గీత రచయిత శ్రీ గరిమెళ్ళ సత్యనారాయణ గారికి తాను రచించిన కథలు చూపిస్తే, ఆయన మనఃపూర్తిగా ఆశీర్వదించి ప్రోత్సహించారు. శ్రీ కొవ్వలి రచించిన 'పల్లె పడుచు' (వాణీ గ్రంథమాల ప్రచురణ) నవలకు శ్రీ గరిమెళ్ల పీఠిక వ్రాశారు. అది వారి మొదటి ప్రచురిత నవల.

ఆ రోజుల్లో రాజమండ్రిలో కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్స్ కంపెనీ పెద్ద ప్రచురణ సంస్థ. శ్రీ కొవ్వలి 'ఫ్లవర్ గర్ల్' పేరుతో ఒక నవల వ్రాసి వారికిచ్చారు. అయితే ఆ రచనను వారి ఆస్థాన కవి శ్రీ పాద కృష్ణమూర్తి గారి పరిశీలనార్థం పంపితే, ఆయన చదివి "భాషాద్రోహం చేసే ఇటువంటి రచనలు ప్రచురిస్తే వంశక్షయం అవుతుంది" అన్నారట. దాంతో శ్రీ వెంకయ్య దానిని ప్రచురించటానికి సాహసం చేయలేక సందిగ్ధంలో పడ్డారు.


కర్మ కాదు

శ్రీ కొవ్వలి

సూచన

చేతులారా చేసుకొన్న ప్రతిపనివల్లా కలిగే ఫలితాన్ని "కర్మ" అని పరిగణించడం హిందూసాంప్రదాయమయింది.

బుద్ధిపూర్వకంగా తాము చేసుకోవడమేమిటి, అనివార్యమైన కర్మసిద్ధాంతాన్ని దానికి ముడిపెట్టడమేమిటి?

మానవులాచరించే కార్యాకార్యాల ననుసరించి ఫలితాఫలితాలు కలుగుతుంటాయన్న జ్ఞానం కలిగి వర్తించుగాని, జీవితంలోని ఒడుదుడుకులు పడకపోవు—

ఇట్లు,
రచయిత.

ఆ సమయంలో వీరాస్వామి అనే పోస్టుమాన్ ఉత్తరాలు బట్వాడా చేయటానికి వచ్చి అక్కడున్న శ్రీ కొవ్వలి నవలను తీసుకుని ఉత్తరాల సంగతి మరిచి, అక్కడే కూర్చుని, మూడు గంటలపాటు ఏకబిగిన ఆనందంగా చదివేశాడట. "దీనిని ప్రచురిస్తున్నారా?" అని వెంకయ్య గారిని అడిగితే "పండితాభిప్రాయం విరుద్ధంగా ఉన్నది" అన్నారాయన. "కానీ దీనిని ప్రచురిస్తే బహుళ జనాదరణ పొందుతుంది." అని

పోస్టుమాన్ రామస్వామి అనడంతో శ్రీ వెంకయ్య ధైర్యంగా దాన్ని ప్రచురించటం, అది బ్రహ్మాండంగా అమ్ముడుపోవటం జరిగాయి. అది మొదలుగా శ్రీ కొవ్వలితో ఒక సంవత్సర కాలంలో వంద నవలలు వ్రాయించి, ప్రచురించింది కొండపల్లి వీర వెంకయ్య సన్స్ ప్రచురణ సంస్థ.

శ్రీ కొవ్వలి తన రచనకు ఇంత పారితోషికం కావాలి అనకుండా, తన రచనలు పాఠకులకు అతి తక్కువ ధరకు చేరాలి అని షరతు విధించారు. అది శ్రీ కొవ్వలి సాహిత్య నిబద్ధతకు నిదర్శనం. ఏడాది కాలంలో వంద పుస్తకాలు వ్రాసి ఇచ్చేట్లయితే, వాటన్నింటినీ కలిపి పన్నెండున్నర రూపాయలకే ఇచ్చేందుకు అంగీకరించారు వెంకయ్యగారు. పుస్తకాన్ని రెండణాలకీ, మూడణాలకీ కూడా ఇచ్చారా రోజుల్లో! ఇది ఆధునిక తెలుగు సాహిత్యానికి పరోక్షంగా పాఠకసంపదను పెంపు చేసిన మహత్తర చారిత్రక ఘట్టంగా భావించాలి.

తనకు ఆర్థికంగా ఉపయోగపడకపోయినా ప్రచురణకర్త నష్టపోకుండా తన రచనలు ఎక్కువమంది పాఠకులకు చేరడానికి తోడ్పడగలిగానని శ్రీ కొవ్వలి సంతృప్తి పడ్డారు. చౌకగా అమ్ముతుంటే చౌకబారు సాహిత్యం అనే వ్యాఖ్యానాలు చేసిన వారు కూడా లేకపోలేదు. అక్షరాస్యత అంతగా లేని ఆ రోజుల్లో ఒకరు చదివి చెప్తుంటే అనేకమంది కూర్చుని వినే పద్ధతిలోనే శ్రవ్యసాహిత్యం నడుస్తోన్న కాలంలో ఎవరికి వారు పుస్తకాన్ని కొని స్వంతంగా చదివే స్థితికి సమాజాన్ని మళ్ళించగలగటాన్ని తక్కువ అంచనా వెయ్యకూడదు.

ఆ రోజుల్లో రైల్వే ప్లాట్‌ఫాం మీద రైలు ఆగగానే కొవ్వలి నవలలు అంటూ అమ్ముకునేవాళ్ళు వచ్చేవారట. రైలెక్కేప్పుడు కొవ్వలి నవల కొని రైలు దిగేలోపు చదవటం పూర్తిచేసేవాళ్లు జనం. ఆ రచనలో అంత వేగం ఉండేది. వాడుక భాషోద్యమం సాధించిన ప్రయోజనం

> ఆ రోజుల్లో రైల్వే ప్లాట్‌ఫాం మీద రైలు ఆగగానే కొవ్వలి నవలలు అంటూ అమ్ముకునేవాళ్ళు వచ్చేవారట. రైలెక్కేప్పుడు కొవ్వలి నవల కొని రైలు దిగేలోపు చదవటం పూర్తిచేసేవాళ్లు జనం. ఆ రచనలో అంత వేగం ఉండేది.

ఇదే! సాహిత్యాన్ని సామాన్యుడిపరం చేయటంలో కొవ్వలి నవలలు ప్రధాన ప్రేరకాలయ్యాయి.

కొవ్వలి నవలలకు అసంఖ్యాకంగా ప్రభావితులైనవారు మహిళలే! ఇంటికి పరిమితమై, కట్టుబాట్ల మధ్య జీవనం సాగిస్తోన్న స్త్రీలకు బడికి వెళ్ళి చదువుకునే అవకాశాలు లేక, బైట ప్రపంచం తెలియక, కూపస్థ మండూకాల్లా జీవించాల్సిన పరిస్థితి! నవయుగ వైతాళికుడు శ్రీ కందుకూరి వీరేశలింగం ప్రారంభించిన సంఘ సంస్కరణోద్యమం, మహాత్మాగాంధీ జాతీయోద్యమంలో మహిళలను భాగస్వామ్యం చేయటం ఈ అన్నింటి నేపథ్యంలో మహిళలు కట్టుబాట్లను త్యజించి బయటకు రావటం అప్పుడప్పుడే మొదలౌతున్న కాలం అది! ఆ సమయంలో కొవ్వలి నవలలు మహిళా చైతన్యానికి ఎంతగానో తోడ్పడ్డాయి. స్త్రీత్వాన్ని, స్త్రీ గౌరవాన్ని నిలబెడుతూ, స్త్రీ మనోభావాలకు పెద్దపీట వేసే రచనలు చేశారు శ్రీ కొవ్వలి.

శ్రీ కొవ్వలి రచనలలలో ఆనాటి సాంఘిక వ్యవస్థ కన్నులకు కడుతుంది. సాంఘిక దురాచారాలను ఎత్తిచూపి, వాటిని రూపుమాపటానికి ఆయన గట్టి కృషే చేశారు. వితంతు బాల్యవివాహాలు, కులమత విభేదాలు ఒకటేమిటీ.... ఆనాడు సమాజం ఎదుర్కొంటున్న ప్రతి సమస్యనీ తన నవలలలో సాక్షాత్కరింపచేయగలిగారు శ్రీ కొవ్వలి.

అటు తెలుగు భాషా వ్యాప్తికి, ఇటు పఠనాసక్తి పెంపుకీ తోడ్పడుతూనే సమాజంలో చైతన్యపూర్వకమైన పురోగతి కోసం పరితపించిన మహారచయిత శ్రీ కొవ్వలి.

సమాజానికి ఉపయుక్తమైన రచనలు వెయ్యికి పైగా చేసి, నవ్యసాహిత్య వీధుల్లో వాడుకభాషకు పట్టంగట్టి ఈనాటి మేటి వచన, రచనా సంవిధానానికి బాటలు పరిచినవాడిగా కొవ్వలి చిరస్మరణీయుడయ్యారు. గ్రాంథిక భాషలోంచి ఈనాటి శుద్ధ వ్యావహారిక భాషలోకి సాహిత్యపరిణామం జరగటానికి ఒక ఉత్ప్రేరకంగా నిలిచారు శ్రీ కొవ్వలి.

> **"తెలుగువారిలో పఠనాసక్తిని పెంపొందించిన వారిలో శ్రీ కొవ్వలి ప్రథముడు. ఆ కృషి ఫలితాన్ని ఈ రోజున అనేక పత్రికలూ, రచయితలూ అనుభవిస్తూ ఉండటం మనం చూస్తున్నాం"**
>
> **- శ్రీ కొడవటిగంటి కుటుంబరావు**

# శ్రీ కొవ్వలిగారితో నా వ్యక్తిగత అనుభవం



- 'సినీ విజ్ఞాన విశారద' ఎస్వీ రామారావు

అది 1965వ సంవత్సరం. నేను రిజిస్ట్రార్ ఆఫీసులో ఉద్యోగం చేస్తూనే నాటకాలు ప్రదర్శిస్తూండేవాణ్ణి. కొన్నింటికి వ్రాశాను కూడా. ఆ నాటకాల్లో నాతోపాటు పాల్గొన్న నటుడు నూతలపాటి శ్రీహరి రావు. ఆయనకి సినిమాల్లో విలన్‌గ నటించాలని కోరిక. నేను కూడా నాటకాలు వ్రాయటం చేత సినీ రచయితగా ప్రయత్నాలు చేద్దామని చిన్న ఆశ. ఒక సుముహూర్తంలో ఇద్దరం కలిసి మద్రాసు మెయిల్ ఎక్కి ఎలూరు నుంచి మద్రాసు మహానగరంలో అడుగుపెట్టాం.

ఒకరోజున శ్రీహరిరావు గారు 'మీకో మంచి మిత్రుని పరిచయం చేస్తాను రండి. ఆయన శ్రీ కొవ్వలిగారు' అంటూ వెస్ట్ మాంబళంలో ఉన్న కొవ్వలి లక్ష్మీనరసింహారావు గారింటికి తీసుకెళ్ళాడు. వెళ్ళేటప్పుడు నేను శ్రీహరిరావు గారిని అడిగాను. "నేను చదువుకునే రోజుల్లో బస్సుల్లోను, రైళ్ళలోనూ, కొవ్వలి వారి నవలలు, జంపనవారి నవలలు అంటూ కుర్రాళ్ళు కేకలువేస్తూ పుస్తకాలను అమ్మేవారు. ఆ పుస్తకాలను నేను చదివాను. కొవ్వలివారి 'సిపాయికూతురు' నవల వారపత్రిక (ఆంధ్రపత్రిక)లో ధారావాహికంగా వచ్చినప్పుడు చదివిన జ్ఞాపకం వారానే వీరు?" నా సందేహాన్ని నివృత్తి చేస్తూ "ఆ కొవ్వలి వారి దగ్గరికే మనం వెళ్తున్నాం" అన్నారు శ్రీహరిరావు గారు. ఇంటిముందు కొట్టాయం లాంటి వసారా. అక్కడ కూర్చుంటే చల్లటిగాలి.

ఆ కాసేపట్లోనే కొవ్వలివారు మాతో ముచ్చటించిన విషయాల వల్ల రచయితలకు ఎటువంటి అన్యాయం జరుగుతుందో ఆ రోజుల్లోనే కథాచౌర్యం ఎంతగా ఉండేదో అన్న విషయాలు తెలిశాయి. అంతకుముందే చాలా సంవత్సరాల క్రితం కొవ్వలివారి కథా సంభాషణలతో రాజరాజేశ్వరీ ఫిలింస్ అధినేత కడారు నాగభూషణం గారు 'తల్లిప్రేమ' సినిమా తీశారు.

'శాంతి' చిత్రం నిర్మాతలైన వినోదాపిక్చర్స్ అధినేతలు డి.ఎల్ నారాయణగారు, దర్శకులు వేదాంతం రాఘవయ్యగారు 'మాగోపి' చిత్రనిర్మాత, దర్శకులు, విక్రం స్టూడియోస్ అధినేత శ్రీ బి.ఎన్ రంగాగారు ఇతర నిర్మాతల గురించి శ్రీ కొవ్వలిగారు చెప్తూవుంటే తెరవెనుక కథలు ఎంత విచిత్రంగా ఉంటాయో అనిపించింది. ఆ తరువాత ఆయనకి పరిచయం ఉన్న ఒక మిత్రుడికి మమ్మల్ని అప్పచెప్పి స్టూడియోలో ఎస్.భావనారాయణగారు చిత్రీకరించే 'లోగుట్టు పెరుమాళ్ళకెరుక' చిత్రం షూటింగ్ దగ్గరికి పంపారు.

అదయ్యాక సినిమా కష్టాలు ఎలా ఉంటాయో ప్రత్యక్షంగా చూశాను. కొవ్వలివారు సినిమాల్లో ఎన్ని కష్టాల నెదుర్కొన్నారో అర్థమైంది. ఉద్యోగ విరమణ అనంతరం నేను హైదరాబాదులో స్థిరపడటం, తర్వాత సినీ పరిశ్రమ వారితో సన్నిహిత సంబంధాలు ఏర్పడటం జరిగాయి.

ఆ క్రమంలో కొవ్వలివారి 'మాగోపి' 'సిపాయికూతురు' చిత్రాల కథానాయకి జమునగారు కొవ్వలివారి ప్రతిభాపాటవాల గురించి నాతో ముచ్చటించేవారు. అలాగే కథానాయకుడిగా 'సిపాయికూతురు' ద్వారా పరిచయమైన కైకాల సత్యనారాయణగారు కూడా కొవ్వలి వారు గొప్పతనాన్ని వారి రచనా కౌశల్యాన్ని వివరించి చెప్పేవారు. ఇవన్నీ నాకు తీయని అనుభూతులు.

శ్రీ కొవ్వలివారు నవలా రచయితగానే కాకుండా సినిమా రచయితగా తనదైన ముద్ర వేసుకున్నారు. ఇంచుమించుగా ఆయన సినిమాలన్నీ బాక్సాఫీసు విజయాలే.



# చిన్ననాటి నుంచి నేనెరిగిన కొవ్వలి



- 'షావుకారు' జానకి
బెంగుళూరు

వెయ్యిన్నొక్క నవలల రచయిత శ్రీ కొవ్వలి లక్ష్మీనరసింహారావు గురించి నాకు తెలిసిన విషయాలు చెప్పమని వారి కుమారుడు నన్నడిగినప్పుడు నా జ్ఞాపకాలు దాదాపు 70-80 ఏళ్ళ వెనక్కి వెళ్లాయి.

శ్రీ కొవ్వలి రాజమండ్రి వాస్తవ్యులుగా ఉన్నప్పుడు నా బాల్యం కూడా అక్కడే గడిచింది. అప్పట్లో మా నాన్నగారు శ్రీ టేకుమళ్ళ వెంకోజీగారు రాజమండ్రి పేపరుమిల్లులో ఒక ఉన్నతోద్యోగిగా ఉండేవారు. ఆయన రసాయనశాస్త్ర నిపుణులు. ప్రత్యేకించి వారు పేపరు తయారీ గురించి లండన్‌లో విద్యాభ్యాసం పూర్తి చేసుకుని రాజమండ్రి పేపరు మిల్లులో చేరారు. మా నాన్నగారు శ్రీ కొవ్వలి వారి మిత్రులు. వీళ్ళిద్దరూ తరుచు 'హస్యబ్రహ్మ' శ్రీ భమిడిపాటి కామేశ్వర రావు గారింట్లో కలుసుకునేవారు.

శ్రీ కొవ్వలి ఆ రోజుల్లో తమ నవలల ద్వారా స్త్రీల సమస్యలను వాళ్ళు ఆ రోజుల్లో ఎదుర్కొంటున్న సాంఘిక కట్టుబాట్లను, దురాచారాలను నిశితంగ విమర్శించేవారు. ఆయన స్త్రీల తరుపున వాదించేవారు. తమ రచనల ద్వారా వితంతు వివాహాల్ని ప్రోత్సహించేవారు. బాల్యవివాహాల్ని ఖండించేవారు. ఆ విధంగా శ్రీ కొవ్వలి ఒక్ సంఘ సంస్కర్త. బహుశా ఏ భాషలోనూ వెయ్యి నవలలు రచించిన రచయిత లేరనిపిస్తుంది. అందువల్ల శ్రీ కొవ్వలి వారు మన తెలుగువారు కావటం మనందరికీ గర్వకారణం. వారు నవలా సాహిత్యానికి చేసిన సేవ అమోఘం, శ్లాఘనీయం.

తదుపరి శ్రీ కొవ్వలి వారు మద్రాసుకి మకాం మార్చినప్పుడు నేను కూడా మద్రాసు వచ్చి సినీ పరిశ్రమలో స్థిరపడటం జరిగింది. చెన్నైలో మేం తరుచూ కలుసుకునేవాళ్ళం. అప్పుడు శ్రీ కొవ్వలిగారు నా జీవిత చరిత్రను వ్రాయడానికి ఆసక్తి కనబరిచారు. ఆ సందర్భంలో ప్రతిరోజూ మా ఇంటికి వచ్చేవారు.

> అప్పట్లో మా ఇంట్లో 'CLEANLINESS IS NEXT TO GOD LINESS' అన్న సూక్తిని మా డ్రాయింగ్ రూంలో ఫ్రేం కట్టించి పెట్టాను. శ్రీ కొవ్వలి వారు ఆ సూక్తిని చదివి ముచ్చటపడి వారి పిల్లలకి ఆ విషయాన్ని పదేపదే చెప్పేవారని వారి అబ్బాయి చి.లక్ష్మీనారాయణ నాకు చెపితే నేను ఆశ్చర్యపోయాను.

ఆయన వచ్చేటప్పటికి షూటింగ్‌కి వెళ్ళవలసి వస్తే, నేను ఆ రోజు ఆయనతో చర్చించవలసిన విషయాన్ని మా 'గ్రండిగ్' టేప్‌రికార్డర్‌లో రికార్డ్ చేసి నేను వెళ్ళటం జరిగేది. వారు ఆ రికార్డింగ్ విని రాసుకునేవారు. కారణాంతరాల వల్ల ఆ రచన పూర్తికాలేదు. అప్పట్లో మా ఇంట్లో 'CLEANLINESS IS NEXT TO GOD LINESS' అన్న సూక్తిని మా డ్రాయింగ్ రూంలో ఫ్రేం కట్టించి పెట్టాను. శ్రీ కొవ్వలి వారు ఆ సూక్తిని చదివి ముచ్చటపడి వారి పిల్లలకి ఆ విషయాన్ని పదేపదే చెప్పేవారని వారి అబ్బాయి చి.లక్ష్మీనారాయణ నాకు చెపితే నేను ఆశ్చర్యపోయాను. చాలా సంతోషపడ్డాను. ఎందుకంటే తోటివారి ద్వారా తాను గ్రహించిన మంచి విషయాల్ని వారి పిల్లలతో పంచుకొనటం అన్నది శ్రీ కొవ్వలి వారి సహృదయత - వారి అహంకారలేమి.

ముఖ్యంగా 'ప్రకాశిక' సంచికను ప్రఖ్యాత రచయిత శ్రీ గురజాడ వారు స్థాపించారని తెలిసి నేను చాలా ఆనందపడ్డాను. ఎందువలనంటే గురజాడవారి 'కన్యాశుల్కం' సినిమాలో 'బుచ్చమ్మ' పాత్రవేసే అదృష్టం నాకు దక్కింది

ఈ సందర్భంలో శ్రీ గురజాడవారు ప్రోత్సహించిన వాడుకభాషా వ్యాప్తి సంఘ సంస్కరణల బాధ్యతలను తమ భుజాలపైన వేసుకుని వెయ్యి నవలల ద్వారా లక్షలాది పాఠకులకు చేరువై గురజాడవారి లక్ష్యాలను నెరవేర్చటానికి కృషిచేసి సఫలీకృతులైన శ్రీ కొవ్వలి వారి గురించి ప్రత్యేక సంచిక వెలువరిస్తున్న ప్రకాశిక పత్రిక సంపాదకులని అభినందిస్తున్నాను.

# నా సినీ జీవితానికి నాంది - శ్రీ కొవ్వలి



కైకాల సత్యనారాయణ
(అలనాటి "సిపాయి కూతురు" సత్యనారాయణ)

అబ్బ - దాదాపు 65 సంవత్సరాల క్రిందటి మాట శ్రీ కొవ్వలి కుమారులు శ్రీ నాగేశ్వరరావు - శ్రీ లక్ష్మీనారాయణలు ఫోన్ చేసినప్పుడు నేను గతంలోకి వెళ్ళి 25 ఏళ్ళ కుర్రాణ్ణి అయిపోయాను. మళ్ళీ ఉత్సాహం ఉరకలు వేస్తోంది. నా వయస్సు మరచిపోయాను. మళ్ళీ ఆ రోజులు తిరిగి వస్తాయా ? దాదాపు 1957-58 లో అనుకుంటా. నిర్మాత శ్రీ డీ.ఎల్. నారాయణ, దర్శకుడు శ్రీ చెంగయ్య గార్లు నన్ను వారు తీయబోయే "సిపాయి కూతురు " సినిమాకి కథానాయకుడిగా ఎన్నుకున్నారు. ఆ క్రమంలో ఆ సినిమాకి కథ, సంభాషణల రచయిత శ్రీ కొవ్వలి లక్ష్మీనరసింహారావు గారిని నేను కలుసుకోవటం జరిగింది.

అప్పటికే సిపాయికూతురు ఆంధ్రపత్రికలో 14 వారాల పాటు సీరియల్ గా (దినపత్రిక) ప్రతి ఆదివారం వచ్చేది. ఎంతో మంది పాఠకులు చదివి ఆదరించారు. మళ్ళీ నవలగా వచ్చింది. చాలా బహుళ జనాదరణ పొందింది. మొట్టమొదటిగానే ఒక సినిమాలో డైరక్టుగా హీరో వేషం ఇవ్వటం, అందునా ఆనాటి అగ్ర నటి జమున గారి ప్రక్కన నటించటం చాలా సాహసోపేతమైన నిర్ణయం. అందులో శ్రీ జమున కథానాయిక . ఆమే సిపాయి కూతురు. నాకు బాగా జ్ఞాపకం. ఈ సినిమా కోసం జమున గారు పోటీపడి గుర్రపుస్వారీ నేర్చుకున్నారు.

అప్పట్లో నా ఆనందానికి అవధులు లేవు. ఈ విషయంలో దర్శక నిర్మాతలనే కాక ముఖ్యంగా శ్రీ కొవ్వలి గారికి నేనెంతో ఋణపడి ఉన్నా. నా చివరి శ్వాస వరకు వారిని మరచిపోలేను. చాలా రోజులు నా సినీజీవితంలో నా ఇంటి పేరు "సిపాయి కూతురు"గానే చలామణి అయింది. అందరూ నన్ను "సిపాయి కూతురు" సత్యనారాయణ గానే పిలిచేవారు. నాకు జన్మనిచ్చిన నా తల్లిదండ్రుల ఋణం ఈ జన్మలో తీరదు. అలాగే నాకు సినీ జీవితంలో జన్మనిచ్చిన డి.యల్. నారాయణ గారిని, కొవ్వలి గారినీ ఎప్పటికీ మరువలేను. అందులో కొవ్వలి మరీ ముఖ్యుడు.

వారి హస్తవాసి చాలా మంచిది. చిన్నప్పుడు శ్రీ కొవ్వలి నవలలు చాలా చదివాను. ఎంతో తమాషాగా, హుందాగా కథని సాగిస్తూ పాఠకులకు మంచి స్ఫూర్తిని, సందేశాన్నిచ్చేవారు. వెయ్యి నవలలు రచించి చరిత్రను సృష్టించిన ధన్యజీవి శ్రీ కొవ్వలి. ఆయనను సినీ ప్రపంచంలో సరిగా ఉపయోగించుకోలేదు. కొన్ని సిద్ధాంతాలకు కట్టుబడి ముక్కుకు సూటిగాపోయే రచయిత. అందుచేత ఆయన సినీ ప్రపంచంలో నెగ్గుకు రాలేకపోయారు.

నా సినీ జీవితంలో ఎంత ఎత్తుకు ఎదిగినా - శ్రీ కొవ్వలిని నేనెప్పుడూ మరువలేదు. నా సినీ ప్రస్థానంలో ఎంతో బిజీగా వుండటం మూలాన శ్రీ కొవ్వలి గారితో ఎక్కువగా గడపలేక పోయాను.

అటువంటి మహారచయిత శ్రీ కొవ్వలిని గుర్తించి ఈ నాటి తరానికి తెలియచేయాలనే తపనతో ప్రకాశిక పత్రికలో రాస్తున్నందుకు నేనెంతో ఆనందిస్తున్నాను. శ్రీ కొవ్వలి వారి గురించి ప్రత్యేక సంచిక వెలువరిస్తున్న ప్రకాశిక పత్రిక సంపాదకులని అభినందిస్తున్నాను.

శ్రీ కొవ్వలిని దాదాపు 6 దశాబ్దాల తర్వాత ఈ విధంగా స్మరించుకున్నందుకు నా జన్మ ధన్యమైంది.

సిపాయి కూతరు సినిమాను ఒక్కసారి చూసుకోవాలన్న కోరిక చాలా బలీయంగా వుంది. ఎవరయినా పుణ్యాత్ములు కలగ చేసుకొని ఆ సినిమాని సంపాదించగలిగితే వారికి జీవితాంతం ఋణపడి వుంటాను.

శ్రీ కొవ్వలి ఇప్పటికీ మనతోనే ఉన్నారు. ఆయన అమరజీవి. ఆయన ఎక్కడ ఉన్నా, ఆయన ఆత్మకు శాంతి కలగాలనీ - మరో కొవ్వలి గా రావాలనీ ఆ సర్వేశ్వరుణ్ణి మనసారా ప్రార్థిస్తున్నాను.

> సిపాయి కూతరు సినిమాను ఒక్కసారి చూసుకోవాలన్న కోరిక చాలా బలీయంగా వుంది. ఎవరయినా పుణ్యాత్ములు కలగ చేసుకొని ఆ సినిమాని సంపాదించగలిగితే వారికి జీవితాంతం ఋణపడి వుంటాను.

# ఇప్పుడు మరో కొవ్వలి రావాలి



**భువనచంద్ర**
తెలుగు పాటల రచయిత

భవనం అందరికీ కనిపిస్తుంది. దానికి చేసిన అలంకారాల్ని, అట్టహాసాల్నీ అందరూ మెచ్చుకుంటారు. పునాదిని ఎవరూ గమనించరు. ఆ భవనం నిర్మింపబడింది పునాది మీదే. ఆ పునాది లేకపోతే భవనమే కుప్పకూలిపోతుంది. ఇది అందరికీ తెలుసు. అయినా, పునాదిని అందరూ విస్మరిస్తూనే వుంటారు.

అలాంటి ఓ పునాది మిగతావాటిల్లాగే విస్మరించబడింది. దానిమీద కట్టిన భవనం 80 సంవత్సరాలకు పైగా అత్యద్భుత విద్యా కిరణాల్ని వెదజల్లి ఇప్పటికీ నిలిచి వుంది. కానీ రంగులు వెలిసింది కారణం అందులో నివసించిన వారెవరూ సరైన జాగ్రత్తలు తీసుకోకపోవడమే.

ఇప్పుడు తెలుగు సాహితీకారులందరూ వెదుక్కుంటున్నారు. అటువంటి పునాదిని నిర్మించే 'మేస్త్రీ' కోసం. వాళ్లకి తెలీదు. 'మాస్టర్స్' కారణజన్ములనీ, తమ కార్యాన్ని నిశ్శబ్దంగా పూర్తి చేసుకుని వెళ్ళిపోతారనీ!

నిజంగా ఇవ్వాళ కావల్సింది రచయితలు/రచయిత్రులు/ కవులు/ నవలాకారులూ/సమీక్షకులూ/ విమర్శకులూ కాదు.

ప్రజల్లో పఠనాసక్తిని పెంచే ఓ కొవ్వలి కావాలి. తన రాతలతో జనాన్ని మెప్పిస్తూ, తన పుస్తకాలనే కాక ప్రతి పుస్తకాన్నీ చదివింపజేసిన కొవ్వలి లక్ష్మీనరసింహారావు కావాలి. నూటికి పదికంటే తక్కువ వున్న చదువరుల సంఖ్యను, నూటిని అరవైశాతం నించి డెబ్భై శాతం వరకూ పెంచిన ఏకైక రచయిత కొవ్వలి లక్ష్మీనరసింహారావు గారు. ఊరూరా, ఇంటింటా మారుమ్రోగిన పేరు, ఆనాడు శ్రీ కొవ్వలిదే. వ్యవహారిక భాషావ్యాప్తికి కృషిచేసిన మహానుభావుల్లో ధృవతారలాంటి పేరు కొవ్వలి వారిదే. ఉపన్యాసాలతో కాక, చేతలతో వ్యవహారిక భాషను వ్యాపింపచేసి చదువరుల సంఖ్యనే గాక, చదువరుల్లో మనో వికాసం



కలిగించింది కూడా నిస్సంశయంగా కొవ్వలివారే.

ప్రపంచంలోనే మొట్టమొదటి సహస్ర రచనల (నవలల) రచయితగా పేరెన్నికగన్న వారు కూడా శ్రీ కొవ్వలి వారే. ఆ రికార్డుని అధిగమించడం మరెవ్వరికీ సాధ్యం కాకపోవచ్చు. ఎందుకంటే, ఒక పుస్తకాన్ని ప్రచురించి అమ్ముకోవాలంటేనే ఓ మహాయజ్ఞంగా మారిన యీ రోజుల్లో, ఒక వెయ్యి రెండు పుస్తకాలు ముద్రించుకోవడం సాధ్యమా? లిటరల్లీ ఇంపాజిబుల్.

ఇటువంటి అసాధ్యమైన పని సుసాధ్యం కావించడానికి కొవ్వలి గారికి పట్టిన సమయమూ, పడ్డ శ్రమా సామాన్యమైనవి గావు.

'అదో సాహిత్యమా?' అని నొసలుతో వెక్కిరించిన మహానుభావులే 'అతను సాధించినది అనితర సాధ్యం' అని ఒప్పుకోవలసి వచ్చింది. మొక్కవోని సంకల్పమే కొవ్వలి గారిని ముందుకు నడిపించింది. లక్షలాది పాఠకుల్ని తనతో నడిపించుకునేలా చేసింది. సాహితీ సమరాంగంలో విజయభేరిని మ్రోగించింది. ఆ సంకల్పం వజ్ర సంకల్పం... వెన్నపూసలాంటి మెత్తని మనసులో పుట్టిన కఠోర సంకల్పం. అందుకే అది సిద్ధించి కొవ్వలిని సిద్ధుడిగా మార్చింది. ఆ సంకల్పమే కొవ్వలిని ఇల్లు వదిలి పెట్టేట్టు చేసింది. నిలవనీయకుండా నిలదీసింది. గ్రంథాలయాల్లోని పుస్తకాల్ని మథించేలా చేసింది. ఆ మథనంలోంచి పుట్టిందే 'పల్లె పడుచు' అనే నవల. అది నిజానికి నవల కాదు, మూడు పెద్ద కథల సంపుటి. అప్పటికే లబ్ధ ప్రతిష్ఠులైన శ్రీ గరిమెళ్ళ సత్యనారాయణగారు (మా కొద్దీ తెల్లదొరతనము అంటూ విప్లవశంఖం పూరించిన మహా రచయిత) పల్లె పడుచుకి పాఠకులై యువ కొవ్వలి లక్ష్మీనరసింహారావుని ఆశీర్వదించారు. పీఠిక వ్రాశారు.

ఆ తరువాత 'దాసీ పిల్ల' ద్వారా మహామహోపాధ్యాయులు శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి గారి ఆశీస్సులు అందుకున్నారు. కొవ్వలి వారి మూడో రచన 'తానాజీ'. 'ఫ్లవర్ గాళ్' అనే కొవ్వలి వారి రచన శ్రీ పాదకృష్ణమూర్తి శాస్త్రి గారి ఆగ్రహానికీ,

నిరాదరణకీ లోనైనా, ఒక పోస్టుమేన్ (వీరాస్వామి)కి అమితంగా నచ్చడంతో కొండపల్లి వీర వెంకయ్య సన్స్ ద్వారా ప్రచురింపబడి అఖండ విజయాన్ని సాధించింది. ఆ తరువాత కథ దిగ్విజయ చరిత్ర. ఏడాదికి వంద నవలలు వ్రాసిన ఏకైక రచయితగా కొవ్వలి పేరు మారు మ్రోగింది.

అందరికీ అర్థమయ్యే భాష, వేగంగా చదివించే శైలి, సామాన్యుడికి పుస్తకం అందుబాటులో వుండేలా నిర్ణయించిన ధర - ఇంకేం కావాలీ?

అక్షరాలు కూడబలుక్కుని చదివేవాళ్ళు కూడా కొవ్వలి రచనలకి 'సాహో' అంటూ గొప్ప రీడర్స్గా మారారు. ముఖ్యంగా ఆడవాళ్ళు. ఎందుకంటే, కొవ్వలి నవలలో చర్చించబడ్డవి స్త్రీల సమస్యలు. వాటికి తగిన పరిష్కారాలే! వేలాదిమంది స్త్రీలు కొవ్వలి రచనలల్లో తమని తాము చూసుకునేవారు. కొవ్వలి సూచించిన మార్గాలను అర్థం చేసుకుని సమస్యలని పరిష్కరించుకునేవారు. విజ్ఞానం, వినోదం, వికాసం.... ఈ మూడింటికీ కొవ్వలి పెద్దపీట వేయడం వల్లనే, ఆయన రచనలు పాఠకులకు అత్యంత ప్రీతిపాత్రమయ్యాయని సహ రచయితలతో కూడా మెప్పును పొందారు. విమర్శించిన వారే కీర్తించడం కన్నా రచయిత సమర్థతకి మరే రుజువు వుంటుంది చెప్పండి?

> అక్షరాలు కూడబలుక్కుని చదివేవాళ్ళు కూడా కొవ్వలి రచనలకి 'సాహో' అంటూ గొప్ప రీడర్స్గా మారారు. ముఖ్యంగా ఆడవాళ్ళు. ఎందుకంటే, కొవ్వలి నవలలో చర్చించబడ్డవి స్త్రీల సమస్యలు. వాటికి తగిన పరిష్కారాలే!

30 సంవత్సరాల వయసు వచ్చేసరికి దాదాపు 600 రచనలు పూర్తి చేశారు కొవ్వలి.

కడారు నాగభూషణం, కన్నాంబ గార్ల ప్రోద్బలంతో 'తల్లి ప్రేమ' అనే చిత్రానికి కథనందించారు. అది అద్భుత విజయాన్ని సాధించింది. ఆ తరువాత 'శాంతి' 'మా గోపి' 'బీదల ఆస్తి' మొదలైన సినిమాలకి రచనలు చేశారు. ఆ తర్వాత

'రామాంజనేయ యుద్ధం, 'సిపాయి కూతురు' వంటి శతదినోత్సవ సినిమాలకి కూడా రచన చేశారు. ఆనాటి సుప్రసిద్ధ నటీమణి భానుమతి గారికి కొవ్వలి రచనలంటే ప్రాణం.

నవలా సాహిత్యాన్ని మారుమూల పల్లెలకు కూడా వ్యాపింపచేయడమే కాదు, సీరియల్స్ గా నవలలు వ్రాయడం కూడా మొదలైంది కొవ్వలిగారితోనే. వారి ముద్ర ఎంత గాఢంగా యువత మీద పడిందంటే, వారి ఒరవడిని వందలాది యువ, యువతీ రచయితలు అందిపుచ్చుకుని ఆ తర్వాత లబ్ధప్రతిష్టులయ్యారు.

ఏనాడూ సన్మానాలని ఆశించని ఏకైక రచయిత కొవ్వలిగారు. సన్మానాలంటే విముఖతవున్నా, కొందరి మొహమాటం వల్లా, కొందరిపై వుండే అభిమానం వల్లా సన్మానాలకి ఒప్పుకోక తప్పేది కాదు. అటువంటి సన్మాలలోనే ఓ రచయిత అన్నారు 'కొవ్వలిని ఎందరో సహ రచయితలు విమర్శించారు. ఆ విమర్శలకి అసలు అర్థమే లేదు. వారి కలపు వేగాన్ని తట్టుకోలేక చేసిన కువిమర్శలవి' అని. నిజాతినిజమైన మాట అది. "ఎందుకు ఆ రచనలకి అంత గిరాకీ?" అని ప్రశ్నిస్తే సమాధానం చెప్పడం అతి సులభం. రీడర్స్ 'నాడి' తెలిసిన రచయిత ఆయన. చదువరులకి ఏం కావాలో, ఏది ఇవ్వాలో, ఎలా ఇవ్వాలో సంపూర్తిగా తెలిసిన సుకవి కొవ్వలి. అందుకే అసంఖ్యాక పాఠకుల్ని ఆయన ఏర్పరచుకోగలిగారు. మరో చిత్రం ఏమంటే, తను వ్రాసిన ఏ కథనీ ఆయన మళ్ళీ రిపీట్ చెయ్యలేదు. తన కథని తానే ఏనాడూ అనుసరించలేదు.

నిజం చెబితే తెలుగులో భాషా విప్లవాన్ని తెచ్చిన విప్లవ రచయిత కొవ్వలి అని ఒప్పుకుని తీరాలి. ఒక సమస్యని నిర్వచించడం వేరు. ఆ సమస్యని నిర్వచించడం వేరు. ఆ సమస్యని ప్రజల్లోకి తీసుకెళ్ళి వారిచేతే పరిష్కరింపజేయడం వేరు. కొవ్వలి ఎన్నుకున్నది రెండో మార్గం. మరొకటి ఏమంటే సహజత్వానికి పెద్దపీట వెయ్యడం. కొవ్వలిది సులభమైన శైలి. అందుకే ప్రసిద్ధ జర్నలిస్టు ఇంటూరి వెంకటేశ్వరరావు వారిని 'హ్యూమనిస్టు' అన్నారు. రచనల్లో విప్లవ భావాలు నిండివున్నా, వాటి గమ్యాన్ని మానవతా వైపు మరలించిన మహా రచయిత కొవ్వలి అని నిస్సందేహంగా చెప్పవచ్చు. కొవ్వలిది సాహితీ చరిత్రలో సువర్ణాక్షరాలతో వ్రాయదగిన ఓ ప్రత్యేక అధ్యాయం.

ఎడతెగక చదివే అలవాటుని ఆంధ్రులకు అందించింది నిస్సందేహంగా కొవ్వలే. అంతేకాదు ఆయన వేగాన్ని అందుకున్న రచయిత మరొకరు లేరు. పుస్తక ప్రచురణ అతిక్లిష్టమైన ఈ రోజుల్లో, అటువంటి రచయిత ఎన్నటికీ రారు

కూడా. ఆ రికార్డు ఎప్పటికీ వారిదే. అందుకేనేమో వారిని 'పద్య కవి బ్రహ్మ, సాహితీ శిరోమణి, నవలా సామ్రాట్, కవి చంద్ర' వంటి బిరుదులు వరించాయి. చలం వంటి లబ్ధప్రతిష్టులూ, శ్రీశ్రీ వంటి యుగకర్తలూ గుండెలోతుల్నుంచి ప్రస్తుతించిన కవి సార్వభౌముడు శ్రీ కొవ్వలి లక్ష్మీనరసింహారావు గారు.

'కొవ్వలి గారి రచనలు ఒక స్క్రీన్‌ప్లేతో ఉంటాయి. పాఠకుడిని మరో లోకంలోకి తీసుకుని పోతాయి. అందుకే ఆయన రచించిన ఒక్క నవల చదివితే, అన్నీ చదివి తీరాల్సిందే.

కొవ్వలి తన రచనల ద్వారా ప్రజలకు అందించింది కేవలం వినోదం విజ్ఞానం వికాసం మాత్రమే కాదు. సంఘంలో జరుగుతున్న అన్యాయాలనీ, అక్రమాలనీ తన నవలల ద్వారా ప్రజల ముందుకు తెచ్చారు. సంఘంలో చెలరేగుతున్న దుష్టశక్తుల్ని ఎలా అరికట్టాలో తన నవలల ద్వారా మార్గ నిర్దేశం చేశారు. వ్యక్తులుగా సంఘంలో మన బాధ్యతల గురించి పదే పదే గుర్తుచేస్తూ మనలని చైతన్యవంతుల్ని చేసే విధంగా అనేక రచనలు చేశారు.

వరకట్నాల్ని నిషేధించమనీ, విధవా వివాహాల్ని ప్రోత్సహించాలనీ, పతితుల్ని ఆదరించి వారిని సంఘజీవులుగా అక్కున చేర్చుకోవాలనీ ఉద్బోధించారు. చదువు యొక్క ప్రాముఖ్యత గురించీ, ముఖ్యంగా మహిళల చదువు గురించీ, తద్వారా సంఘానికి జరిగే మేలు గురించి తన నవలల్లో ఎన్నోసార్లు ప్రస్తావించారు. మహిళల్ని విద్యావంతులుగా ఎలా మార్చవచ్చో చక్కని మార్గాలతో సూచించారు.

ఎందరెందరో రచయితలు పట్టించుకోని 'సంఘసంస్కరణోద్యమాన్ని' కొవ్వలి ఓ ఉద్యమంలా ముందుకు నడిపించారు. ప్రతి సమస్యకు పరిష్కారం ఉండి తీరుతుందనీ, ఆ పరిష్కారాన్ని వెతికే దిశగా మన మస్తిష్కాన్ని మళ్ళిస్తే సమాజం అద్భుతమైన అభివృద్ధిని సాధించగలదని తన నవలల ద్వారా నొక్కి వక్కాణించారు. నా దృష్టిలోనే కాదు, నాటి ప్రొగ్రెసివ్ రైటర్స్ దృష్టిలో కొవ్వలి తిరుగులేని సంఘ సంస్కర్త. సంస్కరణను మాటల చేతేకాదు, చేతల ద్వారా కూడా నిరూపించిన ఏకైక పరిపూర్ణ రచయిత.

ఒక్కటి మాత్రం నిజం. ఆయన రచించడం కోసం బ్రతికారు గానీ బ్రతకడం కోసం రచించలేదు. అందుకే పుస్తకానికి అతి తక్కువ ధరని నిర్ణయించి అత్యధిక పాఠకులకి అందుబాటులో వుండేవారు. కనీసం ప్రతి గ్రంథాలయంలోనూ వారి నవలలూ, ముఖ చిత్రం (ఫోటో) ఉంచాలనీ, మరోసారి వారి రచనలే పాఠకుల సంఖ్య పెరగడానికి కారకాలు కావాలనీ మనః స్ఫూర్తిగా కోరుకుంటున్నాను.

# తెలుగులో పఠనాసక్తిని పెంచిన రచయిత శ్రీ కొవ్వలి



- ద్విభాష్యం రాజేశ్వరరావు
✆ 94403 18415

1935-45 మధ్య కాలం నాటికి తెలుగు ప్రజలలో అక్షరాస్యత చాలా తక్కువ. గ్రంథాలన్నీ గ్రాంథికంలోనే ఉన్నాయి. గ్రాంథిక వాదం రాజ్యమేలుతున్న రోజులు అవి. వాడుక భాషలో రచన చేసిన రచయితను ఒక పురుగును తీసిపారేసినట్లు నీచంగా చూసే రోజులు! అటువంటి రోజుల్లో పరిస్థితులకు ఎదురీది కలం పట్టి సామాన్యుల కోసం, అక్షరం నేర్చిన వాళ్లకు అర్థమయ్యే అతి సామాన్య భాషలో అలతి అలతి పదాల కూర్పుతో ఉత్కంఠ కలిగించే రీతిలో, సంఘ సంస్కరణల దృక్పథంతో, ఆనాటికి అనితరసాధ్యమైన పద్ధతిలో వేయిన్నొక్క నవలలు రాసిన ఘనత కొవ్వలి వారిదే. ఆయన పూర్తి పేరు కొవ్వలి లక్ష్మి నరసింహారావు గారు. ఆయన వయస్సు 30 సంవత్సరాలు నిండే సరికి ఆరు వందల నవలలు వెలువడ్డాయి అనే విచిత్రం చాలామంది నమ్మలేని నిజం!

"తన రచనలు ప్రచురణకు ఇచ్చే ముందు ఆ రచనను అతి తక్కువ ధరకే మార్కెట్ లో అమ్మాలనే నియమం పెట్టేవారు. అది పాటించిన ప్రచురణ కర్తలకు మాత్రమే ఆయన రచనలు ఇచ్చారు."

అనతికాలంలోనే ఆంధ్రుల అభిమాన రచయిత అయ్యేరు. తన రచనలు ప్రచురణకు ఇచ్చే ముందు ఆ రచనను అతి తక్కువ ధరకే మార్కెట్ లో అమ్మాలనే నియమం పెట్టేవారు. అది పాటించిన ప్రచురణ కర్తలకు మాత్రమే ఆయన రచనలు ఇచ్చారు. తెలుగు ప్రచురణ విషయంలో ఇది చాలా అపూర్వమైన విషయంగా ఆ రోజుల్లో అందరూ చెప్పుకునే వారట! అతి సామాన్యుడు కూడా ఆ పుస్తకాలను కొని

చదవగలిగే వాడు ఆ రోజుల్లో. తెలుగు వాళ్ళలో పుస్తకాలు కొనే అలవాటును పెంచినది నిస్సందేహంగా కొవ్వలి వారే. వయోజన విద్యా ప్రణాళికలు, ప్రజా స్వచ్ఛంద సంస్థల ద్వారా అక్షరాస్యతా కార్యక్రమాలు; ఇవేవి ఫలితాలు సాధించలేనంత తొందరగా కొవ్వలివారి నవలలు 'మామూలు మనిషిని అక్షరాలు కూడబలుక్కుని చదివేలా చేశాయి' అనడంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు! అంతే కాకుండా ఆ నాటి బాల్య వివాహాల వంటి సాంఘిక దురాచారాలను తన నవలల ద్వారా ఎండగట్టే వారు. వితంతు పునర్వివాహాల్ని తన రచనల ద్వారా ప్రోత్సహించే వారు.

> తెలుగు వాళ్ళలో పుస్తకాలు కొనే అలవాటును పెంచినది నిస్సందేహంగా కొవ్వలి వారే. వయోజన విద్యా ప్రణాళికలు, ప్రజా స్వచ్ఛంద సంస్థల ద్వారా అక్షరాస్యతా కార్యక్రమాలు; ఇవేవి ఫలితాలు సాధించలేనంత తొందరగా కొవ్వలివారి నవలలు 'మామూలు మనిషిని అక్షరాలు కూడబలుక్కుని చదివేలా చేశాయి' అనడంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు!

కొవ్వలి వారి ప్రభావం ఆ రోజుల్లో సంఘం మీద ఎలా పడిందో చెప్పటానికి స్వానుభవం లోని ఒక సంఘటన వివరిస్తాను. నేను విశాఖ జిల్లా ఎలమంచిలిలోని హైస్కూల్లో చదువుకునే రోజుల్లో అప్పలకొండ అని నాకు సీనియర్ స్టూడెంట్ ఒకడు ఉండేవాడు. వాడికి చిన్నతనంలోనే తండ్రి చనిపోయాడు. ఈ ఒక్కడే కొడుకు. అతని తల్లి నలుగురిళ్ళల్లో చాకిరీ చేసి వీడిని చదివించేది. వాడికి తెలుగు భాష అంటే ఎంతో మక్కువ. కనిపించిన ప్రతి తెలుగు పుస్తకం చదివేసేవాడు. స్కూల్లో చదివినంత కాలం మిగిలిన సబ్జెక్టుల మార్కులు ఎలా వచ్చినా, తెలుగులో మాత్రం ఫస్టు మార్కు సాధించేవాడు. అందుకు కారణం అప్పటి తెలుగు మాస్టారు శ్రీ బయ్యా సూర్యనారాయణ గారు. (వారు తర్వాత రోజుల్లో వారణాసిలో బనారస్ హిందూ యూనివర్సిటీ వైస్ ఛాన్సలర్ గా పనిచేసి పదవీ విరమణ చేశారు.)

అయితే వాడు ఫోర్త్ ఫారం లో ఉండగా వాడి తల్లి ఆరోగ్యం చెడిపోవడంతో ఆవిడ మంచం పట్టింది. కుటుంబ పోషణ భారం మీదపడి  అప్పలకొండ చదువు మానేశాడు. అందుకు ఎంతో బాధపడ్డారు మా బయ్యా మేస్టారు. స్కూల్ విద్యార్థులు దగ్గర అణా, బేడ వసూలు చేసి తన వంతుగా ఐదు రూపాయలు చేర్చి మొత్తం 80 రూపాయలు వాడికి ఇచ్చి, వాడి చేత బస్ స్టాండ్ లో ఓ చిన్న పుస్తకాలు అమ్మే 'గుంచీ దుకాణం' పెట్టించారు. మేమందరం వాడి షాపులోనే అద్దెకు తీసుకుని పుస్తకాలు చదివే వాళ్ళం. చవకగా దొరికే కొవ్వలి వారి నవలలు, అపరాధ పరిశోధక నవలలు మొదలైన వాటితో బాటు సినిమారంగం, రూపవాణి, నవ్వులు-పువ్వులు లాంటి పుస్తకాలు కూడా వాడి దగ్గర దొరికేవి. మా దగ్గర ఉన్న సొంత పుస్తకం ఏదైనా వాడికి మేము చదివాక ఇచ్చేస్తే, దాని బదులుగా నాలుగు పుస్తకాలు మాకు ఉచితంగా చదవడానికి ఇచ్చేవాడు. అలా పుస్తకాలు అద్దెకు ఇవ్వడం ద్వారా వచ్చే డబ్బుతో వాడి బతుకు, వాడి తల్లి బతుకు నిలబెట్టుకున్నాడు. ఇదంతా సుమారుగా 1955-56 ప్రాంతాల నాటి మాట.

1964 డిసెంబర్లో నా కాలేజీ సెలవుల్లో విశాఖపట్నం నుంచి మా ఊరు ఎలమంచిలి వెళ్ళినప్పుడు బస్ స్టాండ్ లో అప్పలకొండ కనిపించాడు. అప్పటికి రెండు నెలల క్రితం ఆంధ్రప్రభ వారపత్రికలో 'ప్రారంభ్యం భోగతో నశ్యేత్' అనే నా కథ ప్రచురితమైంది. నన్ను చూడగానే నా దగ్గరకు పరిగెత్తుకుంటూ వచ్చి "రాజూ... నీ కథ చదివానురా.. చాలా బాగుంది. మన ఎలమంచిలికే ఎంతో మంచి పేరు తెచ్చావు నువ్వు. నాకెంతో గర్వంగా ఉందిరా, నిన్ను చూస్తూ ఉంటే...." అంటూ నన్ను కౌగిలించుకుని పొగడ్తలతో ముంచెత్తాడు. వాడి పొగడ్తలకి ఆనందం కలిగింది కానీ, నేను ఎలమంచిలిలో పేరుమోసిన డాక్టర్ గారి అబ్బాయిని... వాడా, కేవలం పుస్తకాల బడ్డీకొట్టు నడిపే అప్పలకొండ... నడిరోడ్డు మీద వాడు నన్ను అలా కౌగిలించుకోవడం మాత్రం నాకు ఇబ్బంది కలిగించింది. నిజం చెప్పాలంటే కంపరం కలిగింది!! కానీ వాడిని ఏమీ అనలేకపోయాను. వాడి బంధం వదిలించుకుంటూ, "ఎలా ఉన్నావురా అప్పలకొండా..." అంటూ పలకరించాను.

"పుస్తకాల కొట్టు బాగానే నడుస్తోంది రా. పంచాయతీ బోర్డు ప్రెసిడెంట్ గారు దయతలచి క్లబ్ కొండ వాలులో ఓ ముప్ఫై గజాల స్థలం ఇచ్చారు. దానిలో ఓ చిన్న గది, వంటిల్లు కట్టుకున్నాను. ఇక్కడికి దగ్గరే కదా మా ఇల్లు, చూపిస్తాను.. రా!" అంటూ బలవంతంగా వాళ్ళింటికి లాక్కెళ్లాడు.

క్లబ్ కొండ వాలులో చదును చేసిన ప్రదేశంలో వాడి ఇల్లు అనబడే ఒక చిన్న గది, వెనుక ఓ మినీ వంటిల్లు ఉన్నాయి. గది ప్రవేశద్వారం కుడిగా చిన్న బోర్డు మీద 'సీరందాసు అప్పలకొండ, క్లబ్ కొండ రోడ్డు, ఎలమంచిలి' అని తెలుగులో రాసి ఉంది. ఎడం పక్కన ఉన్న మరో చిన్న బోర్డు మీద ముచ్చటగా మూడు అక్షరాలు 'కొవ్వలి' అని రాసి ఉన్నాయి. సంభ్రమంతో అప్పలకొండ వైపు చూశాను .

"నా ఈ చిన్న ఇంటికి కొవ్వలి వారి పేరు పెట్టుకున్నానురా.. టీ తాగడానికి కూడా డబ్బులు లేని రోజుల్లో వారి పుస్తకాలు అద్దెకు తిప్పుకొని నేను, మా అమ్మ గంజి నీళ్ళయినా తాగగలిగేం రా.. ఈ వేళ ఈ పాటి ఇల్లు కట్టుకున్నాను అంటే ఆ పుస్తకాల చలవేరా.." అంటూ ఉద్వేగంతో మాట్లాడేడు. నాకు ఒక్క క్షణం సిగ్గుతో చచ్చిపోయినట్లయింది .

'పది నిమిషాల క్రితం ఈ అప్పలకొండ నన్ను కౌగలించుకుంటే ఎంతో ఇబ్బందిగా, కంపరం ఎత్తినట్లు ఫీల్ అయ్యానా.... ఇంతటి సంస్కారవంతుడిని, నేను ఎంత తక్కువగా అంచనా కట్టేను? నేనెంత అల్పుణ్ణి!' అనుకున్నాను.

ఆ క్షణంలో నాకు అప్పలకొండ ఒక మహోన్నత శిఖరంలా కనిపించాడు. "నువ్వు ధన్యుడవురా అప్పలకొండా!" అంటూ వాడిని ఆప్యాయంగా కౌగలించుకున్నాను.

కొవ్వలి వారు ఆకలితో అలమటించిన రోజులు ఉండేవని వారి ఆత్మీయుల ద్వారా విన్నాను. కానీ చాలామంది 'అప్పల కొండల' ఆకలి తీర్చిన ధన్యజీవి కొవ్వలి. వెయ్యి నవలలు రాసిన ఏకైక నవలాకారుడిగా వారికి నివాళులర్పిద్దాం.*



"రైళ్ళల్లోనూ, బస్సుల్లోనూ కొవ్వలి వారి నవలలు చదువుతూ ప్రయాణం చేసే వారు దిగాల్సిన స్టేషన్ మర్చిపోయేవారు. నవల పూర్తి కావడం, నాలుగు స్టేషన్లు దాటి వచ్చేశాం! అని పాఠకులకు గుర్తురావడం ఒకే సారి జరిగేది. అంత ఇంటరెస్టింగ్ గా ఉండేవి వారి నవలలు. పేర్లు కూడా ఈ నాటి సినిమా పేర్లల్లే తమాషాగా పెట్టేవారు."

- భానుమతీ రామకృష్ణ

# కొవ్వలి నవలలో సామాజిక అంశాలు



**డా. గుమ్మా సాంబశివరావు**
విశ్రాంత ఉప ప్రాచార్యులు, విజయవాడ
98492 65025

తెలుగు సాహిత్య చరిత్రలో వెయ్యి నవలల రచయితగ ప్రసిద్ధి పొందిన ఏకైక రచయిత శ్రీ కొవ్వలి లక్ష్మీనరసింహారావు గారు.

కొవ్వలివారు ఎంత వేగంగా పుస్తకాల్ని చదివేవారో అంత వేగంగా రచనలు చేసేవారు. మరీ విస్తృతంగా కాకుండా, మరీ సంక్షిప్తంగా కాకుండా, తక్కువకాలంలో చదవటానికి వీలయ్యే నవలల్ని అసంఖ్యాకంగా రచించారు. అందుకే ఆయన్ని వెయ్యి నవలల కొవ్వలి అన్నారు. కొవ్వలి వారి సాహిత్యం దొరికిన దానికంటే దొరకవలసింది ఎక్కువగా ఉంది. 'ఎమెస్కో' సంస్థవారు ప్రచురించిన నవలల మూడో సంపుటిలో ఉన్న 'గుడ్డి దర్బార్, తీరని కోరిక, వాగ్దానం, 'ఫ్లవర్ గర్ల్' అనే నవలల్లోని సామాజికాల్ని వివరించే ప్రయత్నమే ప్రస్తుత వ్యాసం.

కొవ్వలివారి శైలి పఠనీయంగా ఉంటుంది. ఆయన రచనలు నిత్యం సమాజంలో జరిగే సంఘటన చుట్టూ తిరుగుతాయి కాబట్టి పాఠకులకు ఎంతో ఆసక్తిని కలిగిస్తాయి. పాత్రల చిత్రణలోనూ కొవ్వలివారు ప్రత్యేక నైపుణ్యాన్ని ప్రదర్శిస్తారు. 'గుడ్డి దర్బార్' అనే నవలకి ముందుమాట రాస్తూ కొవ్వలివారు 'దురాశ దుఃఖానికి చేటు - ఆడపిల్లల వివాహాల సందర్భంలో తల్లిదండ్రులు తాహతుకు మించిన పరుగులెత్తి - ఎకరాలు - ఇళ్ళు మాత్రమే చూచుకొని, గుడ్డి దర్బారుగా ప్రవర్తించటం వల్ల - అనేక కన్యల కంఠాలను చేతులారా కోస్తున్నారు! నేటి సమాజంలో ఇంతకు మించిన విషాదకర విషయం మరొకటి లేదు. ఆలు-మగలకు అనుకూలత లేని సంసారం నరకమనీ –సిరి సంపదలు –వస్తు-వాహనాలు - ఆ నరకాన్ని స్వర్గంగా మార్చలేవనీ - ఎప్పుడూ గుర్తించడం???' అని చెప్పడం ద్వారా లోకం పోకడను బట్టబయలు చేశారని భావించవచ్చు.

బి.ఏ. పాసయిన వ్యక్తి కాలక్షేపం కోసం తన ఇంటికి దగ్గర్లోనే ఉన్న రైల్వేస్టేషనుకు వెళ్ళటం, మెయిలుబండి రాకకోసం వేచి చూడటం, అందులోని వివిధ ప్రాంతాల

స్త్రీల నాజూకులు చూసి రావటం నిత్యకృత్యంగా చేసుకొంటాడు. ఒకరోజు మెయిలు వెళ్ళిన తర్వాత ఇంటికి రాబోతూ ఉంటే ప్లాటుఫారం మీద ఒంటరిగా ఉన్న స్త్రీ చుట్టూ అందరూ పోగుకావటం, అందరూ ఆమె వివరాల్ని అడగటం, చివరకు మన కథానాయకుడు ఆమెను తన ఇంటికి తీసుకురావటం జరుగుతుంది. ఇంట్లో అతను తల్లి, భార్య కూడా అమెను చక్కగా ఆదరిస్తారు. కానీ రాత్రిపూట కథానాయకుని నిద్రలేపి మంచినీళ్ళకోసం అడిగి, చివరికి ఆమె తన కోరికను వ్యక్తం చేయటం, మన నాయకుడు తిరస్కరించటం, ఆ తర్వాత అతడు ఆమెను స్టేషను దగ్గర ఉన్న సత్రానికి తీసుకువెళుతూ వివరాలు అడగ్గా ఆమె తనని గూర్చి చెబుతుంది. తనపేరు తార అన్నది.

> ఆస్తులున్నాయని మోసపు మాటలు చెప్పి ఆడపిల్లల గొంతులు కోసే నీచులుంటారని తార భర్త పాత్ర ద్వారా రచయిత స్పష్టం చేశారు.

ఒక ముసలివాడు ధనవంతుడనని చెప్పి తన తండ్రిని మోసగించి తనను పెళ్ళి చేసుకొన్నాడని, అతడు కూడా అప్పుల్లో మునిగిపోయి చివరికి తనను వ్యభిచారంలోకి దింపే ప్రయత్నం చెయ్యగా తాను ప్రతిఘటించానని, దానికి ఫలితంగా మోసగించి స్టేషనులో తాను దిగిపొయ్యానని చెప్పింది. తల్లిదండ్రులు తమ బిడ్డల భవిష్యత్తును గూర్చి ఆలోచించకుండా ధనాశతో తమ పిల్లల గొంతులు కోస్తున్నారని, ఉన్న ఆస్తినే చూసుకున్నారు గాని, అప్పులను గురించి తెలుసుకోకుండా 'గుడ్డి దర్బారు' పనిచేసినందుకు మా నాయనగారే కుళ్ళి కృశించటం మొదలుపెట్టారు అని తార వాపోవటం దయనీయంగా ఉంది. ఆస్తులున్నాయని మోసపు మాటలు చెప్పి ఆడపిల్లల గొంతులు కోసే నీచులుంటారని తార భర్త పాత్ర ద్వారా రచయిత స్పష్టం చేశారు. తాను వివాహితుడను కాబట్టి తార కోర్కెను తీర్చలేకపోయానని కథానాయకుడు చెప్పిన తర్వాత ఆమె పశ్చాత్తాపపడి అతడిని సోదర సమానుడుగా భావిస్తున్నానని చెప్పింది.

తారను అనాథ శరణాలయంలో చేర్చుతానని చెప్పి ఇంటికి వచ్చి తన తల్లిని, భార్యను కూడా తీసుకుని ముందుగా సత్రం దగ్గరకు వెళతాడు. అక్కడ ఒక

స్త్రీ ఏడుస్తూ కనిపిస్తుంది. వివాహిత అయినా ఆమె మిషను కుట్టే కుర్రవాడితో లేచిపోయే ప్రయత్నం చెయ్యటం, వాడు ఆమెను మోసగించగా, ఆమె మెడలోని నగలు కూడా దొంగిలించి పారిపోతాడు. ఇలాంటి వారు సమాజంలో ఎంతోమంది ఉన్నారని రచయిత చెప్పటం ద్వారా ఎవరైనా జాగ్రత్తగా ఉండాలనే పరోక్ష సందేశాన్నిచ్చారు.

తారను, తనవారిని తీసుకుని సత్రం నుంచి శరణాలయానికి వెళతారు. దాని సెక్రటరీ శివరావు మన కథానాయకుని మిత్రుడు. తారను గూర్చి శివరావుకు చెబుతుంటే లోపల నుంచి వచ్చిన ఒక వృద్ధుడు తారను చూసి తెల్లబోవటం, తార కంగారు పడటం, అందరూ ఆశ్చర్యపోవడం ఒక్కసారే జరిగింది. ఆ వృద్ధుడు తార తన భార్యేనని చెప్పాడు. అతడు తానొక ధనవంతుడనని చెప్పి తానొక బాలికను వివాహం చేసుకోవాలని అక్కడకు వచ్చాడని శివరావు చెప్పటంతో వారి ఆశ్చర్యం రెండింతలైంది. అతడు తారను వివాహం చేసుకుని వ్యభిచారంలోకి దింపాలని ప్రయత్నించినట్లు కథానాయకుడు శివరావుకు చెప్పటంతో కథ ముగుస్తుంది.

సమాజంలో మోసపోయే వాళ్ళున్నంతకాలం మోసం చేసేవారు ఉంటారని, తల్లిదండ్రులు కూడా ధన వ్యామోహం వదలాలని, కేవలం ధనం వల్ల సుఖం లభించదని గుర్తించాలని రచయిత ప్రబోధం. మోసపోయిన వాళ్ళను మంచి బుద్ధితో ఆదుకొనే వాళ్ళు కూడా ఉంటారని తారను ఆదరించిన కుటుంబాన్ని బట్టి గ్రహించవచ్చు.

> ‘గుడ్డి దర్బార్’ అనే ఈ నవలలో కొవ్వలి వారు రచించిన కొన్ని వాక్యాలు పాఠకుల్ని వెంటాడుతూ ఉండటం ఆయన రచనా ప్రతిభకు తార్కాణం.

కొవ్వలి వారి నవలల్లో ముగింపు కొసమెరుపుగా ఉంటుంది. తార భర్త, వృద్ధుడు కనిపించడం, వాడి నిజస్వరూపం తెలిసిపోవడం, మరొక బాలిక మోసపోకుండా అతని ప్రయత్నం ఆగిపోవటంతో కథ సుఖాంతమౌతుంది.

‘గుడ్డి దర్బార్’ అనే ఈ నవలలో కొవ్వలి వారు రచించిన కొన్ని వాక్యాలు పాఠకుల్ని వెంటాడుతూ ఉండటం ఆయన రచనా ప్రతిభకు తార్కాణం.

“ప్రయత్నం చెయ్యడమంటే మనలో ఉంది గాని ఉద్యోగం రావడం మనలో లేదుగా.”

> చాలామంది తల్లిదండ్రులు తమ బిడ్డల పెళ్ళిళ్ళ సందర్భాలలో 'గుడ్డి దర్బారు'గా ప్రవర్తించటం వల్ల వారి కంఠాలను చేతులారా కోసిన వారవుతున్నారు."

"లోకంలో స్త్రీ కంటే లోకువైన వస్తువు మరొకటి లేదుగదా అనుకున్నాను."

"చాలామంది తల్లిదండ్రులు తమ బిడ్డల పెళ్ళిళ్ళ సందర్భాలలో 'గుడ్డి దర్బారు'గా ప్రవర్తించటం వల్ల వారి కంఠాలను చేతులారా కోసిన వారవుతున్నారు."

"కడుపు కూటికోసం కట్టుకున్న భార్య శీలాన్ని భంగపరచడానికి మీ మనసెలా అంగీకరించిందో నాకర్థం కావడం లేదు."

"యౌవన మదంతో నిండివున్న నీ మనస్సు మంచిచెడ్డలను గుర్తించుకోలేదు."

ఇలా ఈ నవలలో అనేక సామాజికాంశాలు ప్రతిబింబిస్తాయి.

ఈ సంపుటిలోని రెండో నవల 'తీరని కోరిక'. దీనికి సూచన అనే శీర్షికతో ముందు మాటను రచించిన రచయిత కొవ్వలి వారు "ఆమె తన మనసులోని కోరికను మనసులోనే ఉంచుకొని, తనువును చల్లార్చుకున్న అభాగిని - ఎందుచేత? పడుచు భార్యలను హింసలు పెట్టే వృద్ధ జంబుకాలకు సిగ్గులేదు, బిడియం లేదు. మీరు వారి నెన్ననండి - ఎన్ని తిట్టండి - ఎన్ని నవలల్లో వారినెక్కించండి - ఎన్ని ఉపన్యాసాలియ్యండి - వారు లెక్కచెయ్యరు. వారి దారి వారిదే! ఎప్పటికైనా స్త్రీ జాతి శాపం వారికి తగిలి తీరుతుంది" అని రచించటం గమనార్హం.

కొవ్వలి వారి నవలల్లో చాలా పాత్రలకు పేర్లుండవు. అలాగే ఈ నవలలోని కథను చెప్పే వ్యక్తి నేను అని అంటుంటాడు. ఆయన భార్య సీత. ఆమెకు అనుమానం ఎక్కువ. అద్దె ఇంటికోసం వెతుకుతున్న సీత భర్త మంచి ఇల్లు ఉందని చెప్పడంతో సీత అడిగిన ప్రశ్నలు అన్నీ ఇన్నీ కాదు. అంతేగాకుండా ఆ ఇంటి యజమానురాలు తాయారును గూర్చి భర్తతో అనేకవిధాలుగా మాట్లాడింది సీత. అనుమానం ఉంటే ఆ ఇల్లు కాకపోతే మరో ఇల్లు చూద్దామని భర్త అంటే అంత సౌకర్యమూ, అద్దె తక్కువ గల ఇల్లు దొరకదని సీత మొత్తానికి ఆ ఇంట్లోకే దిగేటట్టు చేసింది. ఆచారి ఇంటి యజమాని. ఆయన వృద్ధుడు. ఆయన పడుచు పెళ్ళాం తాయారు. తాయారుకు, సీతకు బాగా స్నేహం కుదిరి సీతను అక్కా అని పిలిచే స్థితికి చేరింది. తాయారు మాటిమాటికి సీత దగ్గరకు వెళ్లటం

ఆచారికిష్టం ఉండదు. సీత భర్త మంచి వయసులో ఉండటమే దీనికి కారణం. డబ్బుకక్కుర్తి కోసం ముసలాళ్ళకు ఇచ్చి రంభల్లాంటి కన్యల కంఠాలు కోసినప్పుడు కాపురాలిలాగే ఉంటాయని ఒక ప్రబోధం చేస్తాడు రచయిత. తాయారు సీత భర్తతో తన తీరని కోరికను తనలోనే అంతరించిపోవాలని చెబుతుంది. ఒకరోజు తాయారు సీత భర్తను ప్రేమించానని సీతతోనే చెప్పటంతో సీత ఎంతో బాధపడింది. మగజాతిని నమ్మకూడదని భర్తతో అన్నది.

తాయారు కోరిక తీరకపోవటంతో ఆమె ఆరోగ్యం క్షీణించింది. ఆ సమయంలోనూ సీత మనసు కరగలేదు. తాయారు ఎంతో మంచి మనిషి. ఆమె వండినవన్నీ సీతకు తెచ్చి ఇస్తూ ఉండేది. అయినా తన భర్తను ఆమె కోరుకోవటాన్ని సహించలేకపోయింది. సీత భర్త తాయారు పట్ల జాలిగా ఉండేవాడు. ఆమెను ఆసుపత్రికి తీసుకువెళ్ళబోయేముందు ఆమె దైన్యాన్ని చూసి తట్టుకోలేకపోయాడు.

ఒకరోజు ఆచారి గారు వచ్చి సీతతో ప్రాణాలు పోయే సమయంలో కూడా తాయారు మీ ఆయన నామజపం చేస్తున్నదని, ఆయన్ని చూస్తే తప్ప ఆమె ప్రాణాలు పోవని డాక్టర్లు చెబుతుంటే వచ్చానని చెబుతాడు. సీత దంపతులు హాస్పిటల్‌కి వెళ్ళినప్పుడు సీత తాయారు స్థితిని గమనించిన సీత బతికితే తన దాంపత్య సౌఖ్యంలో ఆమెకూ సగభాగం ఇస్తానని చెప్పటంతో తాయారు కళ్ళు మెరుస్తాయి. ఆచారి, సీత కలిసితాయారుకు - సీత భర్తకు ఏకాంతం కలిగించారు. తాయారు సీత భర్త ఒడిలో ప్రాణాలు విడిచింది. ఆమె కోరిక తీరకుండానే అనంతవాయువుల్లో లీనమైంది. డబ్బు కక్కుర్తితో పడుచువాళ్ళని వృద్ధులకిచ్చి చేస్తే కలిగే అనర్థాల్ని రచయిత ఈ నవలలో దర్శింపజేశాడు.

> డబ్బు కక్కుర్తితో పడుచువాళ్ళని వృద్ధులకిచ్చి చేస్తే కలిగే అనర్థాల్ని రచయిత ఈ నవలలో దర్శింపజేశాడు.

కొవ్వలి వారి మరో నవల 'వాగ్దానం' దీనికి సూచన రాస్తూ రచయిత 'స్వతంత్ర జీవనం చెయ్యలేని స్త్రీకైనా, పురుషుడికైనా అగచాట్లు తప్పవు. ఏ వ్యక్తికైనా దురభ్యాసం అలవడిందంటే అది అలవడినంత సులువుగా వీడదు. దౌర్భల్యం కలిగిన హృదయంలో నిగ్రహం దానంతట అది రావలసిందే కాని, ఒకరి గుణపాఠం వల్ల గాని, ఒకరి మెప్పుకోసం గాని రాదు. పై రెండూ ఈ నవలలో సూచించబడిన విషయాలు' అని చెప్పటం గమనార్హం.

తల్లిదండ్రులు లేని రాధ కొంతకాలం మేనమామ పోషణలో ఉండి ఆ తర్వాత తన స్నేహితురాలు కోయిలతో ఉంటున్నది. కోయిల పరోపకారబుద్ధి కలది కావటంతో రాధకు ఆశ్రయమిచ్చింది. రాధ తొందరపాటు మనస్తత్వం కలది. విలాసాల వ్యామోహం గలది. అందుకే కోయిల చెప్పినా వినకుండ ఫొటోగ్రాఫర్ వసంతరావు వలలో పడుతుంది. అతణ్ణి రిజిష్టర్ మ్యారేజ్ చేసుకుని పశ్చాత్తాపపడుతుంది. కోయిల చెప్పిన మాటల్ని వినకపోవటం వల్లే తనకు ఈ కష్టాలు వచ్చాయని బాధపడుతుంది. పెళ్ళయిన కొద్దిరోజులకే వసంతరావు వాస్తవరూపం బయటకు వచ్చింది. అతని వ్యసనాలు పెరిగిపోయి సంసారం గడవటమే కష్టమైంది. అందువల్ల మద్రాసుకు మకాం మార్చుదామని చెబుతాడు. మద్రాసు వెళ్ళబోయే లోపు రాధ కోకిలను కలుసుకోగా, మద్రాసులో ట్రయినింగ్‌లో చేరతానని రాధ చెప్పగా రెండు చీరలు, పది రూపాయలు ఇచ్చి కోకిల బాధగా వీడ్కోలు పలికింది.

> పెళ్ళయిన కొద్దిరోజులకే వసంతరావు వాస్తవరూపం బయటకు వచ్చింది. అతని వ్యసనాలు పెరిగిపోయి సంసారం గడవటమే కష్టమైంది.

మద్రాసు వెళ్ళిన ఆరునెలల దాకా వసంతరావు కాపురం బాగానే సాగింది. సంపాదనతో పాటు వ్యసనాలు పెరిగాయి. కాకినాడలో లాగానే మద్రాసులో కూడా చిక్కులు మొదలయ్యాయి. వసంతరావు నెలల తరబడి ఇంటికి రావడం మానేశాడు. కోకిల సలహా ప్రకారం రాధ ట్రైనింగ్‌లో చేరింది. కానీ ఆరు నెలలు గడవకుండానే పురిటికి హాస్పిటల్‌లో చేరవలసి వచ్చింది.

స్నేహితురాలు కోకిల మాటల్ని విననందుకు రాధ కష్టాలు పడవలసి వచ్చింది. వ్యసనాలకు బానిస కావటం వల్ల వసంతరావు తనతో పాటు రాధను కూడా బాధపెట్టాడు. ప్రణాళిక లేకుండా జీవితం సాగితే ఎంత దుఃఖాన్ని మూటగట్టుకోవలసి వస్తుందో వీళ్ళిద్దరి ద్వారా రచయిత సమాజానికి సందేశం అందించాడు.

హాస్పిటల్లో చేరిన రాధ మగబిడ్డను కన్నది. వసంతరావు రాధను గూర్చి పట్టించుకోవటం మానేశాడు. చుట్టుపక్కల వారికి తాను హాస్పిటల్‌కి

వెళుతున్నానని రాధ చెప్పి వచ్చినా ఫలితం లేదు. ఒకవైపు మగబిడ్డ పుట్టాడన్న సంతోషం, మరోవైపు భర్త ఏమైపొయ్యాడోనన్న దుఃఖం ఆమె ఏమీ చెయ్యలేని స్థితి. నెలరోజుల తర్వాత కరుణామయులైన డాక్టరమ్మకు తన బిడ్డను అప్పగించి తాను ట్రైనింగ్‌కు వెళ్ళాలనుకొంది. డాక్టరమ్మ మాత్రం రాధతో 'నీ భర్త వచ్చి తన బిడ్డను కోరినప్పుడు అతని వశం చేస్తాములే' అన్నది. దానికి రాధమ్మ అంగీకరించి కాగితం మీద సంతకం చేసింది. కోయిల మాట విననందుకు బాధపడి డాక్టర్ సలహామేరకు ట్రైనింగ్‌కు వెళ్ళింది. ఇంటికి వెళితే భర్త జాడ లేదు. అయినా ఎంతో కష్టపడి రాధ ట్రైనింగ్ పూర్తిచేసి డాక్టరమ్మ దగ్గరకు వెళ్ళింది. డాక్టరమ్మ 'చేసిన వాగ్దానం మరచిపోకు. నీ బిడ్డ నా దగ్గర ఉంటే ఒకటి. నీ దగ్గర ఉంటే ఒకటీనా రాధా?' అని చిరునవ్వుతో పలికి బిడ్డకు విద్యాబుద్ధులు నేర్పిస్తానని కాకినాడ మిషను గరల్స్ స్కూల్లో ఖాళీ ఉందట వెళతావా?' అని అడగడంతో అక్కడ కోయిల కూడా ఉంది కాబట్టి రాధకు ఎంతో సంతోషం కలిగింది. కొన్ని సంవత్సరాలు కాకినాడలో రాధ ఉద్యోగం చేసింది. రాధ తన వాగ్దానానికి భిన్నంగా నడుచుకోవడం ఇష్టంలేక తనలో తాను దుఃఖించింది కానీ తన బిడ్డను డాక్టరమ్మ దగ్గరనుంచి వేరుపరచటానికి ఇష్టపడలేదు.

విధి బలీయంగా ఉంటుంది. అందుకే వసంతరావు పక్షపాతంతో హాస్పిటల్లో చేరి కొద్దిగా తగ్గిన తర్వాత అతని వివరాలనడిగితే అతడు తన భార్య రాధ అని, ఇప్పుడెక్కడ ఉందో తెలియదని సమాధానం చెబుతాడు. అప్పుడు డాక్టరమ్మ అక్కడ ఉన్న బాబు వాళ్ళ అబ్బాయేనని చెప్పి అయిష్టంగానే అతడిని వసంతరావుకు అప్పగించింది.

క్రిస్టమస్ సెలవులకు రాధ, కోయిల మద్రాసు వచ్చి షాపింగ్ చేస్తున్నారు. వీధిలో పిల్లవాడితో అడుక్కొంటున్న వసంతరావును చూసి రాధ నిర్ఘాంతపోయింది. బిడ్డను దగ్గరకు తీసుకునేలోపు వసంతరావు మూర్ఛపడటంతో అతన్ని హాస్పిటల్‌కి తీసుకువెళ్ళారు. అక్కడ డాక్టరమ్మ అంతా చెప్పింది. రాధను క్షమాభిక్ష కోరుతున్న వసంతరావు తన తాగుడి అలవాటు మానలేదని రాధ గుర్తించింది. అప్పుడు రాధ వసంతరావుతో తాగుడు జోలికి పోనని వాగ్దానం చెయ్యమంటే బిడ్డ సాక్షిగా వాగ్దానం చేస్తాడు. అప్పుడు కోయిల 'వాగ్దానం చెయ్యడం కంటే దాన్ని ఆచరణలో పెట్టడం చాలా కష్టం' అన్నది.

'అది చూడవలసి ఉంది' అంది డాక్టరమ్మ.

తన వాగ్దానాన్ని వసంతరావు అక్షరాలా ఆచరణలో పెట్టాడు. 'రాధకు ఉద్యోగంలో

> ఈ నవలా సంపుటిలోని చివర నవల 'ఫ్లవర్ గర్ల్'. ఈ నవలకు కొవ్వలివారు చిన్నమాట పేరుతో ముందుమాట రాశారు.

అభివృద్ధి, బిడ్డ యొక్క చదువు సంధ్యలు చూసిన వసంతరావు తన జీవితాన్నప్పటికి పరిశుద్ధం చేసి తన్ను క్షమించాడని తెలుసుకున్నాడు.'

ఈ విధంగా తమ ఆలోచనల్ని అదుపులో పెట్టుకోలేకపోవటం వల్ల రాధ కష్టాలకు గురైందని, వ్యసనానికి బానిస కావటం వల్ల వసంతరావు సంసారం కష్టాలపాలైందని, కొంతమంది ఆత్మీయుల సహకారం వారి జీవితాల్లో వెలుగు నింపిందని రచయిత పఠనీయ శైలిలో ఈ నవలను రచించారు.

ఈ నవలా సంపుటిలోని చివర నవల 'ఫ్లవర్ గర్ల్'. ఈ నవలకు కొవ్వలివారు చిన్నమాట పేరుతో ముందుమాట రాశారు.

'తిండి లేకపోతే తిరుగుబాటు తప్పదు' అని గుర్తుంచుకోగలిగిన నాగరిక దేశాలు, వివిధ మార్గాల వల్ల ఆ తిరుగుబాటును తప్పించుకుంటాయి. కనుక సంఘంలోని ఏ వ్యక్తి అయినా పూర్తిగా చెడిపోయిన నాడూ అంటే అందుకు సంఘం యొక్క సానుభూతీ, దయా, వివేకమూ లేకపోవడమే కారణంగా ఈ నవల నిరూపించగలదని నా నమ్మకము' అని నవల హృదయాన్ని రచయిత వెల్లడించారు.

'ఫ్లవర్ గర్ల్' అనే ఈ నవలను రచయిత ఫ్లాష్ బ్యాక్ పద్ధతిలో రచించాడు. 'పువ్వుల పిల్ల' నర్మద. ఆమె పూలమ్ముతూ బొంబాయి నగరంలో ఒక శ్రీమంతుల మేడ దగ్గరకు రావటం, తలనిండా పూలు పెట్టుకొన్న నర్మద మాటతీరును చూచి ఆ మేడ మీదనుంచి కిందకు వచ్చిన ఒక వితంతువు ఆశ్చర్యపడి, సంతోషించి పువ్వుల పిల్ల వృత్తాంతాన్ని తెలుసుకోవాలని కుతూహలపడటం, ఆ పిల్ల తన వృత్తాంతాన్ని చెప్పటం ఈ నవలలోని సారాంశం.

గోపీనాథ్ అనే వ్యక్తి సంపన్న కుటుంబీకుడు. అతని తండ్రి వ్యాపార భాగస్వామి డ్యూక్ మోసం చెయ్యటం, తండ్రి మరణించటం, కుటుంబం కష్టాల పాలుకావటం, ఉన్నత విద్యావంతుడైన గోపీనాథ్ తన తల్లి, చెల్లెల్ని పోషించటం కోసం దొంగతనాలు చెయ్యటం విచారకరం. పేదరికం, ఆకలి ఎలాంటి నేరానికైనా పురికొల్పుతాయని గ్రహించవచ్చు. నర్మద తండ్రి బాబాకి

> తన కథనంతా విన్న బాబా ఒకసారి బొంబాయి వెళ్ళినప్పుడు అక్కడ అతని తల్లిని, చెల్లెళ్ళని కలుసుకోవటం, వారికి కొద్దిగా ఆర్థికసహాయం అందిచటాన్ని గమనిస్తే కొవ్వలి నవలల్లోని 'సినిమాటిక్' సన్నివేశం కళ్ళకు కడుతుంది.

గోపీనాథ్ కథను చెబుతుంటే ముందుగా అతనంటే భయపడిన నర్మద తర్వాత అతనిమీద జాలిపడింది. ఆ పైన మనసుపడింది. ఒకరోజు బాబా ఉళ్ళోలేని సమయంలో నర్మద, గోపీనాథ్‌లు శారీరకంగా ఏకమవుతారు. కొవ్వలి వారి నవలల్లో ఏదో ఒకచోట కించిత్ శృంగార ఘట్టాన్ని కల్పించటం సర్వసాధారణం. ఈ నవలలోనూ అదే జరిగింది. గోపీనాథ్ బాబాకు తన పేరు చెప్పలేదు. కానీ తన కథనంతా విన్న బాబా ఒకసారి బొంబాయి వెళ్ళినప్పుడు అక్కడ అతని తల్లిని, చెల్లెళ్ళని కలుసుకోవటం, వారికి కొద్దిగా ఆర్థికసహాయం అందిచటాన్ని గమనిస్తే కొవ్వలి నవలల్లోని 'సినిమాటిక్' సన్నివేశం కళ్ళకు కడుతుంది. ఒక దొంగతనానికి వెళ్ళినప్పుడు గోపీనాథ్ మీద అనుకోకుండా హత్యానేరం మోపబడటం, అతనికి ఉరిశిక్ష పడటం, రక్షక భటులు అజాగ్రత్తగా ఉన్నప్పుడు అతడు జైలునుంచి బయటపడి బాబా ఆశ్రమంలో రక్షణ పొందటమే గాకుండా తన కథనంతటినీ చెబుతాడు.

తండ్రి వ్యాపారంలో భాగస్వామి మోసం చేయటం, ఆ భాగస్వామి తన ద్వారా సహాయాన్ని పొందాలనుకొంటే తల్లి వారించటం, భగవంతుడు వారి పక్షాన ఉంటే తప్పకుండా ఆ సంస్థకు గోపీనాథ్ యజమాని అవుతాడని తల్లి చెప్పిన మాటలు యధార్థం కావటం కూడా ఆశ్చర్యాన్ని, ఆనందాన్ని కలిగిస్తాయి. గోపీనాథ్ ఆస్తి అతనికి దక్కటానికి అతని దగ్గర ఉన్న కాగితాల్ని బాబా ఆశ్రమంలో వదలివెళితే, గోపీనాథ్ బాబాకు తన వృత్తాంతాన్ని గూర్చి చెప్పి తమకు శామ్యూల్ అనే న్యాయవాది సహకరిస్తాడని చెప్పటం, ఆ కాగితాన్ని నర్మద శామ్యూల్‌కు అందించటం, గోపీనాథ్‌కు వారి ఆస్తి దక్కటం అన్నీ ఆశ్చర్యంగా జరుగుతాయి.

బాబా ఆకస్మిక మరణంతో నర్మద పువ్వులు అమ్మే అమ్మాయిగా జీవనాన్ని

సాగించటం, ఒక స్త్రీ ఆమెను మోసం చెయ్యదలచుకోగా ఆ గండం నుంచి నర్మద బయటపడటం, అంతకుముందు బాబా ఆశ్రమంలో అనుకోకుండా పుష్పమాలను నర్మద గోపీనాథ్ మెడలో దండ వెయ్యటం ద్వారా అతన్ని వరించటం అనే విషయాలు కథను చకచకా నడిపిస్తాయి. పువ్వుల అమ్మాయి నర్మదను ఆపి ఆమె వృత్తాంతాన్ని తెలుసుకోవటానికి ప్రయత్నించి విధవ గోపీనాథ్ తల్లి అని తెలియటం, మొత్తానికి నర్మద ప్రవాహం అటూ ఇటూ సాగి చేరవలసిన తీరానికే చేరుకోవటంతో కథ సుఖాంతమవుతుంది.

బాల్యంలో నర్మద అల్లరి పనులు, బాబా ఆశ్రమంలో నర్మద గోపీనాథ్‌ను భయపెట్టటానికి ఉడికించటానికి చేసిన చేష్టలు హాస్యస్ఫోరకాలు. కథ చివరలో నర్మద గోపీనాథ్‌లు ముద్దుపెట్టుకొంటూ ఉండగా గోపీనాథ్ చెల్లెలు శచి గంపెడు విచ్చిన మల్లెపూలు తెచ్చి వారిమీద పోసి 'పువ్వుల పిల్లకు పువ్వులొద్దూ' అని కిలకిల నవ్వుతూ పారిపోవటం ఒక చక్కని ముగింపు.

> కొవ్వలి నవలల్లో సంస్కరణ దృక్పథంతో పాటు, ఎక్కడో ఒకచోట శృంగార సన్నివేశం ఉండటం ఒక ప్రత్యేకత. అయితే అది పరిమితికి లోబడి మాత్రమే ఉంటుంది కాని విచ్చలవిడిగా ఉండదు.

కొవ్వలి నవలల్లో సంస్కరణ దృక్పథంతో పాటు, ఎక్కడో ఒకచోట శృంగార సన్నివేశం ఉండటం ఒక ప్రత్యేకత. అయితే అది పరిమితికి లోబడి మాత్రమే ఉంటుంది కాని విచ్చలవిడిగా ఉండదు. స్త్రీల హృదయాల్ని చక్కగా చిత్రించగల నేర్పు కొవ్వలివారికి ఉంది. 'గుడ్డిదర్బార్, తీరనికోరిక' నవలల్లో ఇది ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. వృద్ధాప్య వివాహాల వల్ల కలిగే తీవ్రపరిణామాలు ముఖ్యంగా స్త్రీల మనోవేదన, యౌవన ప్రభావంతో తీసుకొనే వేగవంతమైన నిర్ణయాల వల్ల కలిగే దుష్పరిణామాలు, ఆర్థికవనరుల లేమివల్ల చట్టవిరుద్ధమైన కార్యాన్ని చెయ్యటానికైనా వెనుకాడని తత్త్వం కొవ్వలి నవలల్లో కనిపిస్తాయి. అయితే మంచివారికెప్పుడైనా మంచి కలుగుతుందనే భరోసా కూడా కొవ్వలి నవలల్లో కనిపించటం విశేషం.

కొవ్వలి రచనల్లో గుర్తుంచుకోదగిన మాటలు అక్కడక్కడా తళుక్కున మెరవటం విశేషం.

'నా బంగారం మంచిదైతే ఒకరేం చెయ్యగలరు.'

'ఏ పనైనా చేయవచ్చును గాని మొగాడికి వంట చెయ్యడమంత చండాలం పని మరొకటి లేదు.'

'ఇటువంటి ద్రోహమేనా మీరు చెయ్యవలసింది? అసలీ మొగజాతినెవరు నమ్మమన్నారు?'

'పశువుల్లో వుండే మత్సరం నాలో వుండబట్టి నీకోరిక కడ్డు నిలిచాను.'

'అవివాహితులైన మనమిద్దరమూ ఒకచోట కలసి వుంటే లోకం యేమనుకొంటుంది?'

'వివాహమంటేనే స్వాతంత్రానికి భంగం. ఇప్పుడు నీ భర్తకు నీపై సర్వహక్కులూ వున్నాయి.'

'ఎప్పుడూ ఒకరికి సాయం చెయ్యడంలోనే మన జీవితాన్ని వినియోగం చేసుకోవాలి.'

'నా శరీరంతో పాటు హృదయం కూడా మొద్దుబారిపోయింది.'

'స్త్రీ పురుషులొంటరి పాటున కలుసుకొంటే ఎటువంటి భావములైనా పుట్టవచ్చును.'

- ఇలా ఎనో వాక్యాలు పాఠకుల్ని వెంటాడుతూ ఉంటాయి.

కొవ్వలి వారి సంక్షిప్త జీవిత చరిత్రను రచించిన డా.ద్వానా శాస్త్రి గారి మాటలతో నా వ్యాసాన్ని ముగించటం సముచితమని భావిస్తాను.

"ముప్పయి సంవత్సరాలు నిండేసరికే ఆరువందల రచనలు చేశారంటే - కొవ్వలి మేథ ఎంత ప్రతిభావంతమైనదో ఆ రచనా వేగాన్ని అందుకొనేవారు అప్పుడూ లేరు - ఇప్పుడూ లేరు. కథను ఎక్కడా ఆపకుండా చకచకా నడిపించడంలో కొవ్వలి వారిది అందెవేసిన చెయ్యి. కథను ఎక్కడ మొదలుపెడతారో, ఎక్కడెక్కడ మలుపులు తిప్పి చివరకు శుభం పలుకుతారో కొవ్వలికి మాత్రమే తెలిసిన విద్య."

> **నా దృష్టిలో శ్రీ కొవ్వలి ఒక 'థిరిటీషియన్' కారు. ఫలానా 'ఇష్టు' అనబడడానికి ఆయన నొచ్చుకోరు. అయినప్పటికీ ఆయనను నేను 'హ్యూమనిస్టు' అని పిలుస్తాను. మానవతా వాదానికి శంఖారావం కలపడమే 'హ్యూమనిస్టు' లక్ష్యం, లక్షణం అని నా భావన**
>
> **-ఇంటూరి వేంకటేశ్వర రావు, చిత్ర దర్శకులు**

# తెలుగు సాహిత్య మాధుర్యం



- N. Ch. చక్రవర్తి
హైద్రాబాద్
93999 58069

తేట తెలుగు భాషా సాహిత్యంలో ఉన్నన్ని సౌందర్యాలు మరి ఏ ఇతర భాషలలోనూ లేవనిపిస్తుంది. వైదేశికాలైనా గుణాలను సంగ్రహించి తనలో కలుపుకోవడం అన్నది ఒక విశేష తెలుగు స్వభావంగా మనం గుర్తించాలి.

సహజ పాండిత్యుడు అయిన పోతన మహాకవి ఆంధ్రీకరించిన మహాభాగవతంలోని వామనావతార ఘట్టంలోని ఈ పద్యం చిత్తగించండి.

వామనుడు బలి యాగస్థలికి వచ్చాడు. పొట్టివాడుగా వచ్చిన ఆ వటువు తన బుడిబుడి అడుగులతో చేష్టలతో అందరిని ఆకర్షించాడు. బలిని సమీపించి అంటున్నాడు.

**మత్తేభం:-**

ఇతడే దానవ చక్రవర్తి, సురలోకేంద్రాగ్ని కాలాది ది
కృతి గర్వాపనయ ప్రవర్తి, గతలోభస్ఫూర్తి, నానామఖ
వ్రతదాన ప్రవణానువర్తి, సుమనోరామామనోభేదనో
ద్ధతచంద్రాతపకీర్తి, సత్యకరుణా ధర్మోల్లసన్మూర్తి దాన్ - 1

ముందు తనను పసికట్టకుండా జాగ్రత్త పడాలి. అందుకై రాజును మంచి చేసుకోవాలి. ఎంచుకున్న పదాలూ బలి గుణగణాలకు తగినట్టు ఉండాలి. అందుకే అంత మనోహరమైన పద్యం. మత్తేభం ఎంచుకోడంలోనే కవి ప్రతిభ తెలుస్తుంది.

'ఇంద్రుడూ మొదలైనవారి గర్వాన్ని అణచివేసిన ఇతడే రాక్షస రాజు. లోభంలేని స్ఫూర్తి కలవాడు. నిత్యమూ యజ్ఞ-యాగాదులలో దాన-ధర్మాలు చేస్తూ ఉండేవాడు. స్త్రీల మనసులను రంజింప చేసే చంద్రుడు. సత్కీర్తి, సత్యం, ధర్మం, కరుణాది సద్గుణాలతో ప్రకాశించేవాడు.' అని పొగడాడు.

ఇతడే దానవ చక్రవర్తి అనే ఎత్తుగడ పద్యానికి అందం. ఇంక ఎలా

ఎత్తుకున్నా ఇంత నిండుగా రాదు. ఇతడే అని నిర్ధారణ చెయ్యడం వల్ల ఎదుటికీ(బలికి) ఒకింత ఆనందం కలుగుతుంది. ఇది వామనుని ప్రణాళికలో మొదటి ఎత్తుగడ. ఈ ఎత్తుగడతోనే బలిని తన వశం చేసుకున్నాడు వామనుడు. ఇలాంటి మనోహరమైన పద్యాలు భాగవతంలో కోకొల్లలు.

ఆధునిక కవుల్లో ప్రసిద్ధులైన వేదుల సత్యనారాయణ శాస్త్రి కవివరుల పద్యం ఒకటి చూద్దాం.

పూవు ఆత్మను కరుణశ్రీ పుష్పవిలాపం ద్వారా ప్రకటించి ప్రసిద్ధులు అయ్యారు. వేదుల వారు తమ దేశభక్తిని జోడించి పువ్వు ఆత్మలో ప్రవేశపెట్టి ఎలా ఆవిష్కరిస్తున్నారో చిత్తగించండి.

పూవుకు ఇష్టంలేని పనులు మనం చేస్తున్నాము. రాతి విగ్రహాలకు సమర్పిస్తున్నాం. అధములైన వారి మెడలో దండలుగా వేస్తున్నాము. వేడుకల్లో మన ఇండ్ల గుమ్మాలకు ఉరితీసి వ్రేలాడేస్తున్నాము. వీటిద్వారా పూవు ఆత్మలో ఘోషిస్తున్నది. మరి పూవుకాంక్ష ఏమిటి??

**ఉత్పలమాల:-**

నీచపు దాస్యవృత్తి మననేరని శూరత మాతృదేశ సే
వాచరణమ్మునందసువులర్పణసేసిన వారిపార్థివ
శ్రీ చెలువారుచోట తదసృగ్రుచులన్ వికసించి వాసనల్
వీచుచు రాలిపోవగవలెన్ దదుదాత్తసమాధి మృత్తికన్ - 2

నీచాతినీచమైన దాస్యవృత్తిని సహింపక మాతృదేశం స్వేచ్ఛకై పోరాడి దేశంకోసం ప్రాణాలు అర్పించిన దేశభక్తుల త్యాగమూర్తుల రక్తధారలలో వికసించి వారి పరమపవిత్ర సమాధులపై రాలిపోవాలి. ఇదీ పూవు కాంక్ష. ఎంత ఉదాత్త గంభీర భావనయో చూడండి.

ఇంక శతక పద్యాలలోకి వస్తే.. రామభక్తునిగా ప్రసిద్ధుడై రామునకై తన జీవితాన్ని అంకితం చేసిన కంచెర్ల గోపన్న తన దాశరథి శతకంలో ఇలా ఆవేదన చెందాడు.

**చంపకమాల:-**

సరసుని మానసంబు సరసజ్ఞుడెరుంగును ముష్కరాధముం
డెరిగి గ్రహించువాడె? కొలనేకనివాసముగాగ దర్దురం
బరయగనెర్చునెట్లు వికచాబ్జమరందరసైక సౌరభో
త్కరము మిళిందమొందుక్రియ? దాశరథీ! కరుణాపయోనిధీ! - 3

ఓ రామా!! గొప్పవాని హృదయం గొప్పవానికే తెలుస్తుంది. గుణహీనునకు తెలియదు. ఎలాగంటే ఒకే కొలనులో నివాసం ఉన్నా తామరలోని మకరందాన్ని కప్ప ఆస్వాదించగలదా?? ఆ మకరంద ఆస్వాదన అన్నది తుమ్మెదకే సాధ్యం.

ఈ పద్యంలోని మర్మం ఏమి?? ఓ రామా!! నా బోంట్లు సద్భక్తులు. మమ్ములను కరుణించి ప్రోచే పరమాత్మవు నీవే. ఇతర దైవతాలు ఎవరు మా హృదయాలను గ్రహించగలరు?? అని రామదాసు ఆవేదన.

అవధానివరులు నారాయణం బాలసుబ్రహ్మణ్యం గారి చంద్రశేఖర శతకంలోని ఒక పద్య రత్నాన్ని చూద్దాం.

**చంపకమాల:-**

గళమున కాలకూటమది గాటపు మంటల బాధపెట్టగా,
దలపయి గంగ చిందులిడ, తాలిమివీడిన పత్ని పోరుచే
పొలుసుల పాము కర్ణముల బుస్సుననూదుచు లొల్లిపెట్టగా
కలకలనవ్వగల్గుటెటుగల్గెనొదేవర? చంద్రశేఖరా!! - 4

శివుని సందేశం ఏమిటో కవి చెప్తున్నాడు. ఒక ప్రక్క కంఠంలో విషం మండుతూ ఉంటుంది. తలపై గంగ చిందులువేస్తూ చీకాకు పెడుతూ ఉంటుంది. సవతిపోరుతో పార్వతి సతాయిస్తూ ఉంటుంది. మెడలో పాము బుసలుకొడుతూ గోల చేస్తూ ఉంటుంది. ఇన్ని సమస్యలతో నిత్యమూ సతమతం అవుతున్నా కలకలా నవ్వుతూ ఉండగల్గడం నీకే సాధ్యం దేవా!! చంద్రశేఖరా!! నీకిది ఎలా సాధ్యం అంటారు కవి బాలసుబ్రహ్మణ్య అవధాని. ఇందులో దైవతత్వాన్ని మనం గ్రహించాలి. చుట్టూ ఎన్ని సమస్యలు మనని బాధిస్తూ ఉన్నా మనం చిరునవ్వుతో బ్రతకాలి. మన నవ్వే హిమం అయి, ఆ సమస్యల వేడిని చల్లబరచాలి. ఈ తత్వాన్ని మనం కైలాసవాసుని చూచి ఆయన భక్తులుగా అలవరచుకోవాలి అని కవి భావన.

ఈ విధంగా తెలుగుసాహిత్యంలో అనర్ఘరత్నాలు ఎన్నో! ఎన్నెన్నో!!

**సూచనలు:**

1. పోతన భాగవతంలోని వామనావతార ఘట్టం నుండి.

2. వేదుల సత్యనారాయణశాస్త్రి గారి పద్యరచనల్లో కాంక్ష పద్య ఖండిక నుండి.

3. దాశరథి శతకం (రోహిణి పబ్లికేషన్స్ -రాజమండ్రి)

4. నారాయణం బాలసుబ్రహ్మణ్యం ధేనువకొండ, ప్రకాశంజిల్లా వారి చంద్రశేఖర శతకం నుండి.

# తిలక్ కథలు – శిల్పసౌందర్యం

(రెండవ భాగం)



- డా|| పి.సి.వెంకటేశ్వర్లు
సహాయ ఆచార్యులు ప్రాచ్యపరిశోధన సంస్థ
శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం
తిరుపతి
94901 64963




## తిలక్ రచనలలో సంభాషణలు

సంఘటనలు, పాత్రలు, మాటలు సమంగా ఉంటే కథ మంచి శిల్పాకృతిని పొందుతుంది. తొలి ఆధునిక కథ సంభాషణతో మొదలౌతుందని మనకు తెలిసిన విషయమే. ఆ నిర్మాణ పద్ధతిని తిలక్ కూడా కొనసాగించడం కథల్లో మనం చూడవచ్చు. ఈ సంభాషణ శిల్పం ప్రధానంగా మూడు రకాలుగా వుంటుంది. 1. కథకుడు తాను మాట్లాడుతూ పాత్రల చేత మాట్లాడించడం. 2. కథకుడే పాత్రల పక్షాన మాట్లాడడం. 3. కథకుణ్ణి దూరంగా పెట్టి పాత్రలే మాట్లాడడం. ఈ మూడు రకాల పద్ధతుల్లో తిలక్ మొదటి రెండింటిని అనుసరించాడు. 'కదిలే నీడలు' కథలో స్త్రీ, పురుష పాత్రలే ఎక్కువగా మాట్లాడతాయి. అక్కడక్కడ వివరణల కోసం మాత్రమే కథకుడు జోక్యం చేసుకుంటాడు. 'బాబు' కథలో కూడా కొన్ని పాత్రల చేత సుభాషింప చేస్తూ, మధ్యలో వ్యాఖ్యానం చేస్తూ నడిపిస్తాడు. 'గడియారపు గుండెలు' కథలో రాఘవయ్య కథనంతా కథకుడే చెప్పుకుంటూ పోతాడు. అలాగే 'కవుల రైలు', 'బొమ్మ', 'నిర్మల మొగుడు', 'ఏమీ లేదు' కథల్లో కూడా కథకుడు పాత్రల పక్షాన నిలబడి మాట్లాడుతాడు. ఇలా మూడవదైన పాత్రలే మాట్లాడుకుంటూ కథను

పూర్తి చేసే టెక్నిక్ ను తిలక్ పూర్తిగా ఉపయోగించ లేదు. కానీ 'మణి ప్రవాళం', 'రాత్రి 9 గంటలకు' వంటి కథల్లో తొంబై శాతం సంభాషణలే వుంటాయి.

తిలక్ తన కథల్లో పాత్రల చేత చేయించిన సంభాషణలు కథను ఒక్కొక్క చోట ముడివేస్తాయి. మరొక చోట కథ వేగాన్ని పెంచుతాయి. జరిగిపోయిన గత కాలపు సంఘటనల్ని సూచిస్తాయి. పాఠకుణ్ణి ఆకట్టుకుని ఆలోచింపచేస్తాయి. ఇలాంటి సంభాషణలు చేయించాలంటే కథకునికి పాత్రలు కొట్టిన పిండై వుండాలి. 'ఓడిపోయిన మనిషి' కథలో సుబ్బులు, ఉత్తమ పురుష కథకుడికి మధ్య సాగిన సంభాషణ ఒక సంపూర్ణ జీవన భ్రమణాన్ని చూపిస్తుంది. ఒక స్త్రీ మనస్తత్వాన్ని, స్వేచ్ఛా జీవితాభిలాషను సూచిస్తుంది. "రంగడా! ఇంకా ఆడెక్కడ?" అంది. "ఏం! రంగడు పోయాడా?" ఆత్రంగా అన్నాను. "ఛ ఛ - దుక్కలా వున్నాడు. నేనే వాడిని వొగ్గేశాను"

"ఏం?"

"నా కిష్టం లేకపోయింది" "ఇన్నాళ్ళు మరి ఏం చేస్తున్నావు" "వీరాసామితో గుంటూరు వెళ్ళిపోయాను" "అతన్ని పెళ్ళిచేసుకున్నావా" "ఆ గుంటూరులో మా బలేగా వుందిలే. వీరాసామి కూడా బాగుండేవాడు కానీ..." "అతనితో కూడా చెడిందా" "అతను దేన్నో మరిగాడు. నాకు శానాకోపం వచ్చింది" "ఇప్పుడు కలిసున్నారా?" "ఆడిని ఒగ్గేశాను" "మరి ఇప్పుడొక్కరైవే వున్నావా" "నువ్వున్నావు కదయ్యా, నీకోసమే వచ్చినాను" గమ్మత్తుగా చూస్తూ పవిటకొంగు నోటికి అడ్డం పెట్టుకొని నవ్వుతోంది. (ఓడిపోయిన మనిషి)

'ఉంగరం' కథలో నిత్య దరిద్రాన్ని అనుభవిస్తున్న ఒక యువతి గొప్ప జీవితాన్ని గడపాలని ఉబలాట పడుతుంది. పెద్దింటి అబ్బాయి తనను చూసి పెళ్ళి చేసుకుంటే బాగుంటుందని పగటి కలలు కంటుంది. తన లాగే పేదింటి సీతాలు ఒక గొప్పింటి అబ్బాయిని పెళ్ళి చేసుకుందని తెలుసుకొని ఆమెతో మాట కలుపుతుంది. 'నన్ను కూడా తీసుకుపోయేందుకు ఎవడినైనా చూసి పెట్టు సీతాలూ' అని మాట్లాడంలో పాత్ర అమాయకత్వాన్ని చూపించాడు రచయిత. 'దేవుణ్ణి చూసినవాడు' కథలో గవరయ్య పెళ్ళాం లేచిపోయిన వార్త ఊర్లో సంచారం చేస్తుంటుంది. ఆ సందర్భంలో తిలక్ కూర్చిన ఒక సంభాషణ గ్రామీణ పాత్రల తత్వాన్ని గొప్ప శిల్పంలో ఆవిష్కరించింది.

'వాడిలో ఏం చూసి లేచిపోయిందత్తా' అని మూడోసారి అడిగింది. తన అత్తని ఒక పడచు తన కుతూహలం ఆపుకోలేక.

'పోనీ నువ్వే వాడితో లేచిపోక పోయావూ నీకు తెలిసొచ్చును." అంది అత్తగారు విసుగుతో, కోపంతో కథలోని పాత్రలతో సంబంధం లేకపోయినా, ఇలాంటి సంభాషణ కథకు వ్యంగ్యాత్మక శిల్ప మర్మాల్ని అమరుస్తాయి.

సంభాషణల్లో వృత్తి, ప్రాంత మాండలికాల్ని ప్రయోగించడం ఒక శిల్పరీతి. తిలక్ కథల్లో ప్రాంతీయ మాండలికాల జోలికి వెళ్ళలేదు. అయితే 'సముద్రపు అంచులు' కథలో బెస్తవారి మాండలిక సంభాషణలు ఉపయోగించాడు.

> సంభాషణల్లో వృత్తి, ప్రాంత మాండలికాల్ని ప్రయోగించడం ఒక శిల్పరీతి. తిలక్ కథల్లో ప్రాంతీయ మాండలికాల జోలికి వెళ్ళలేదు. అయితే 'సముద్రపు అంచులు' కథలో బెస్తవారి మాండలిక సంభాషణలు ఉపయోగించాడు.

'నీకోసం పల్లెకి యెల్లాను' అంది చంద్రి, వీరా దగ్గాడు. 'ఏమైపోయ్యావో అని అడిలిపోయాను' 'సముద్రంలో పడి సచ్చిపోదామనుకున్నాను. కాని సావలేదు' 'మరి మన ఇల్లు మాట ఏంటి యీరయ్య బావా' అంది చంద్రి గొంతులో వికారాన్ని అణుచుకుంటూ. 'ఉత్తది. అంతా ఉత్తది. మనం యింతే. ఇలాగే వుంటాం. యెదవ ఆశ..." 'అంతేనా' వెర్రిగా నవ్వింది చంద్రి.

'మరి నేనేంటి సేసేది. ఎక్కడికి పోయేది' ఇలాంటి సంభాషణల వల్ల పాఠకుల్లో హృదయ ద్రవీకరణ కల్గించడానికి భాష ఉపయోగపడుతుందని గ్రహించిన తిలక్ 1964లో చివరి కథల్లో ఈ శిల్పాన్ని ప్రయోగించి వుంటాడు. అలాగే 'రాత్రి 9 గంటలకు' స్కెచ్ నిండా సంభాషణా శిల్పాన్ని దృశ్యమానం చేశాడు తిలక్.

ఆశ్చర్యంతో నిశ్చేష్టులయ్యే సంభాషణా శిల్పాన్ని తిలక్ 'అతని కోరిక' కథలో చూడొచ్చు. బిడ్డకు తిండి పెట్టి బ్రతికించుకోలేని ఒక నిస్సహాయ పాత్ర, బ్రతకడం కోసం భార్య మంగళసూత్రాలు జేబులో పెట్టుకొని అమ్మేందుకు ప్రయత్నించిన పాత్ర. ఏమీ చేయలేక సమస్యల్ని మర్చిపోవడానికి మంగళసూత్రం ఇచ్చి

సానెతో సంపర్కంకోసం వెళ్ళినపుడు ఆ పాత్రకి ఫలహారం పెట్టించి 'ఇదిగో పది రూపాయలు దగ్గరుంచుకో. నాకూ తెలుసు కష్టం ఏమిటో?' అని సాగనంపిన పుష్పలత సంభాషణలోని శిల్పాన్ని తిలక్ మాత్రమే చూపగలడు అన్పిస్తుంది.

పది వాక్యాల్లో చెప్పవలసిన భావాన్ని ఒక్క వాక్యంలో చెప్పగలిగిన నేర్పు వాక్య శిల్పం. కథకుడు ప్రయోగించే కొన్ని వాక్యాలు పాఠకుణ్ణి జీవితకాలం ఆలోచింప చేసేవిగా ఉన్నట్లయితే ఆ కథకుడు గొప్ప కథాశిల్పకారుడైనట్లే. తిలక్ కథల్లో అలాంటి వాక్యాలు వందల సంఖ్యలో వుంటాయి.

## వాక్య శిల్పం

పది వాక్యాల్లో చెప్పవలసిన భావాన్ని ఒక్క వాక్యంలో చెప్పగలిగిన నేర్పు వాక్య శిల్పం. కథకుడు ప్రయోగించే కొన్ని వాక్యాలు పాఠకుణ్ణి జీవితకాలం ఆలోచింప చేసేవిగా ఉన్నట్లయితే ఆ కథకుడు గొప్ప కథాశిల్పకారుడైనట్లే. తిలక్ కథల్లో అలాంటి వాక్యాలు వందల సంఖ్యలో వుంటాయి. పాఠకుణ్ణి నిలబెట్టి ఆలోచనల్లోకి నెట్టే వాక్యాలు ప్రతి కథలోనూ వున్నాయి.

'ఆశాకిరణం' కథలో ఒక టీచర్ తన పై అధికారిణిని క్షమాపణ కోరబోయే తొందరలో చేతికి చిక్కిన పైట కొంగు పట్టుకుంటాడు. ఆ సమయంలో రచయితగా తిలక్ రాసిన "అంతే ఉద్యోగం ఊడిపోయింది. ఆమె పైటకన్నా బహిరంగంగా; అంతకన్నా శాశ్వతంగా" అనే వాక్యం ఎంతో బలంగా పాఠకుణ్ణి తాకుతుంది.

'బాబు' కథలో యువకుడు పనిలో నుండి పారిపోతున్నతీరును వివరించడానికి స్వతంత్రంలోంచి దాస్యంలోకి పోయే ముందు ప్రతి జాతీ, ప్రతి వ్యక్తీ, ప్రతి జంతువు కూడా ఓపిక లేని తిరుగుబాటును చేస్తాయి. అనే గొప్ప వాక్యాన్ని రాశాడు తిలక్. ఇక్కడ 'ఓపికలేకున్నా తిరుగబడడం' అనే వాస్తవాన్ని వాక్యంలో కూర్చడం మంచి శిల్పం.

'గడియారపు గుండెలు' కథలో ఒక పాత్ర స్వభావాన్ని చెప్పడానికి కొన్ని వాక్యాల్ని రాయకుండా ఒక రోజున రాఘవయ్యతాత గారు వచ్చారు. ఆయన

ఒళ్ళంతా విబూది, హృదయం అంతా బొగ్గు! యజ్ఞం చేయించడంలో అంతటి వాడు లేడని ప్రతీతి. అనే వాక్యంలో స్పష్టంచేశాడు. ఒక పేరాలో చెప్పవలసిన కథను తిలక్ ఒక వాక్యంలో ముగిస్తాడు. 'తీవ్రవాద నాయకుడు' కథలో శేషయ్య కుటుంబ వివరాలను "శేషయ్యకి ఓ విధవ అక్కగారూ, తల్లీ ఉండేవారు. ఇతని సంపాదనా చాతుర్యానికి తట్టుకోలేక తల్లి పరలోకానికి చప్పుడు చేయకుండా వెళ్ళిపోయింది. అంతకన్నా గప్ చిప్ గా అక్కగారు ఒకనాటి రాత్రికి రాత్రి ఎవడితోనో లేచిపోయింది." అంటూ వ్యంగ్యాత్మకంగా చెప్పి ముగిస్తాడు.

'హోటల్లో' కథలో అప్పు తీర్చలేదనే కారణంతో ఒక వ్యక్తి భార్యను ముగ్గురు వ్యక్తులు వాటాల ప్రకారం పంచుకుంటున్న సందర్భంలో రచయిత చేసిన 'మానవుడిలో పశుత్వం నల్లని వాసనతో హోటలునంతా ఆవరించింది.' అనే వ్యాఖ్య వాక్యశిల్పానికి మచ్చుతునక. అదేవిధంగా 'సముద్రపు అంచులు' కథలో 'సముద్రం లాంటిదే దరిద్రం కూడా అవతలి ఒడ్డు కనబడదూ.'; 'జీవితం' కథలో 'విధి నల్లని పెదవులు వారి జీవితాన్ని ముద్దెట్టుకున్నాయి; "శ్రావ్యంగా పాడేవాడికీ, పాట రాని వాడికీ వొకటే హృదయం వుంది. 'నీకంటే నేను గొప్ప వాణ్ణి' అనడానికి ఎవరికీ హక్కు లేదు." వంటి వాక్యాలు ఆయనలోని వాక్య శిల్ప నిర్మాణ దక్షతను నిరూపిస్తాయి. వర్ణనాశిల్పం

కవిత్వంలోనూ, కథల్లోనూ మానవతా వాదాన్ని విన్పించిన తిలక్ వర్ణనల జోలికి వెళ్ళివుంటాడా అని ఆలోచించవచ్చు. అయితే తిలక్ వర్ణనలు నేల విడిచి సాము చెయ్యవు. జీవితపు పొరలు చుట్టూ అల్లబడి వుంటాయి. కథలో గాఢతను పెంచడానికి, సన్నివేశంలో వాస్తవికతను ప్రతిఫలింప చేయడానికి తిలక్ కథల్లో అతి నవ్యమైన వర్ణనాశిల్పాన్ని ఉపయోగించాడు. 'బ్లాకౌట్ చేయబడిన విద్యుద్దీపాలు నగరపు మెల్లకన్నులులా వున్నాయి" (కదిలే నీడలు) 'బురదలో వున్న వానపాము మీద అడుగేసినప్పుడు ఆ వానపాము గిలగిలలాడి నీరసంగా నిశ్శబ్దంగా చచ్చిపోవడం లాంటి ఏడుపు" (ఆశాకిరణం) - అనే వర్ణన చేతకాని వ్యక్తి ఏడ్పును వర్ణించడానికి తీసుకున్న పోలిక. బియ్యం దొరక్క పడుతున్న మానసిక సంఘర్షణలో పెళ్ళాం తిట్లు అతన్ని నిస్పహాయుణ్ణి చేసినపుడు గట్టిగా రోదించలేని ఏడుపు అది.

'వెన్నెల, వెన్న చేతులతో 'రారా' అని పిలుస్తుంటే చీకటి మొండి దేహాన్ని కౌగిలించుకుంటున్నట్టుగా అనిపించింది' (యవ్వనం) అనే వాక్యాలు ఒక వైపు భార్య సౌందర్యం చేయి జాచి పిలుస్తుంటే ఉద్యోగ ధర్మం యమపాశంలా వెంటాడుతున్న శాస్త్రి తత్వాన్ని వ్యాఖ్యానిస్తూ రచయిత చేసిన వర్ణనాశిల్పం.

'వేగంతో శ్రమించి పోయే కాలానికి, పదార్థం మొండి తనానికి జరుగుతున్న అనాది యుద్ధానికి చిహ్నంగా నిలిచినట్టుంది. ఆ ఇల్లు" (ఊరి చివర ఇల్లు) అనే వర్ణన భౌతికత తత్వం నశించి పోవల్సిందే. కాలం గమనం సాగించాల్సిందే అనే వాస్తవికతను ఆధారం చేసుకుంది.

> రచయిత తనకు నచ్చని ఒక అంశం మీద చేసే వ్యాఖ్యనే 'కంఠ స్వరం' అంటాం. సమాజంలో న్యూనతలను, అసమానతలను, స్థితి గతులను వ్యాఖ్యానించవలసి వచ్చినప్పుడు కథకుడు తాను ఎటువైపు ఉన్నాడో తెలియజేసే గొంతుకే కంఠ స్వరం. తిలక్ కథల్లో అనేక చోట్ల తన గొంతుకను విన్పిస్తాడు. ఎలాంటి సమాజాన్ని, ఎటువంటి మనిషిని కోరుకుంటున్నాడో పరోక్షంగా తెలియజేస్తాడు.

'దుమ్ములోంచి నొసటి మీద ఎర్రని నేత్రాన్ని, కాళ్ళకి చేతులకీ అరుణ కంకణాల్నీ, దేహానికి బూడిదనీ ధరించిన అపర శివుణ్ణి రోడ్డుమీద పోయే ఇద్దరు ప్రమథులు లేవనెత్తారు' (సుందరీ - సుబ్బారావు) కారు ఢీకొట్టిన వ్యక్తికి తగిలిన రక్తపుగాయాల్ని, శరీరం దుమ్ములో మునిగిన రూపాన్ని ఇంతకంటే వాస్తవికంగా తిలక్ మాత్రం వర్ణించగలడు.

'దూరంగా త్రాచుపాము, హంతకుడి ఆలోచనలా, మెలికలు తిరుగుతూ వెళ్ళింది." (జీవితం) మనిషి వర్ణించాల్సినపుడు జంతువుల్ని, దేవదానవుల్ని ఉపమానంగా తీసుకుంటాం. కాని తిలక్ పామును వర్ణించడానికి హంతకుడిని ఉపయోగించాడు. అదే తిలక్ టెక్నిక్.

పట్టణాన్ని వర్ణిస్తూ 'రంగు వేసుకున్న మొహం రాకాసి వంటి అహం మిరుమిట్లు కొలిపే నవ్వుతో మెత్తగా కౌగలిస్తుంది నిన్ను' (రాత్రి 9 గంటలకు) అంటాడు తిలక్. దీన్ని అత్యంత రమణీయమైన వర్ణనా శిల్పం అనకుండా ఉండగలమా! కంఠ స్వరం.

రచయిత తనకు నచ్చని ఒక అంశం మీద చేసే వ్యాఖ్యనే 'కంఠ స్వరం' అంటాం.

సమాజంలో న్యూనతలను, అసమానతలను, స్థితి గతులను వ్యాఖ్యానించవలసి వచ్చినప్పుడు కథకుడు తాను ఎటువైపు ఉన్నాడో తెలియజేసే గొంతుకే కంఠ స్వరం. తిలక్ కథల్లో అనేక చోట్ల తన గొంతుకను విన్పిస్తాడు. ఎలాంటి సమాజాన్ని, ఎటువంటి మనిషిని కోరుకుంటున్నాడో పరోక్షంగా తెలియజేస్తాడు.

'గాలీ వెల్తురూ అట్టే సోకని పతివ్రత ఉండటానికి చాలా బాగుంటుంది' (హోటల్లో). ఒక హోటల్ గది స్వరూపాన్ని చెప్తూ ఉదహరించిన వాక్యాలివి. మన సమాజంలో వెళ్ళూనుకొని వున్న కర్మ సిద్ధాంతంలో భాగంగా వున్న పతివ్రతల దుస్థితి పై తిలక్ అభిప్రాయమిది. -

'ఎంత మంది శ్రామికుల రక్తం తాగితే ఈ బుగ్గలకి ఎరుపు వచ్చింది? ఎంత మంది బట్ట లేకుండా వుంటే ఈమెకి జరీ చీర వచ్చింది. ఒక అన్యాయపు ఆర్థిక విధానపు సృష్టి ఈమె' అనే వాక్యం 1948లో రాసిన 'బొమ్మ' కథ లోనిది. ఇందులో రచయిత ఏ దాపరికం లేకుండా సామ్యవాదాన్ని విన్పించాడు. బహుశా ఈ వాక్యాల్ని తర్వాత ఆత్రేయ 'కారులో షికారు కెల్లే..." పాటగా మలిచాడు.

'నల్లజర్ల రోడ్డు' కథలో సాయం పొంది ప్రాణం దక్కించుకున్న వ్యక్తులు, ఆ ప్రాణం పోసిన వ్యక్తి ప్రాణాపాయ స్థితిలో వుంటే సాయం చేయకుండా తప్పించుకుపోతూ ఒక వాక్యం అంటారు. అందుకు రచయిత ఒక వ్యాఖ్య చేస్తాడు. "అందులో కలెక్టర్ గారికి మాట యిచ్చామాయె!" అన్నాడు రామచంద్రం - మాట ఇచ్చి తప్పడంలోని అమానుషత్వాన్ని వూహించుకుని భయపడుతూ" మనిషి మానుష స్వభావంపై కొరడాతో కొట్టినట్లుందీ తిలక్ వ్యాఖ్య.

'ఆమెకి దేవుడి మీదా మనిషి మీదా విశ్వాసం ఒక్క పెట్టున తుడిచి పెట్టుకుపోయినట్లయింది' (ఊరి చివర ఇల్లు)

'తత్వాలు పాడే ఒక చిన్న సైజు ఆధ్యాత్మిక వాది. పెళ్ళాం పోయాక ముండలతోను, ఒళ్ళు పాడైపోయాక మందులతోనూ, ఓపిక పోయాక బైరాగులతోనూ మైత్రి సంపాదించిన విఖ్యాత జీవి' (సముద్రపు అంచులు). వంటి వ్యాఖ్యలు వ్యవస్థలో దేవుడి పై, సన్యాసులపై తిలక్ గొంతుకను తెల్పుతాయి.

'ఊరికి కరణమూ, భాషకి వ్యాకరణమూ ప్రబల శత్రువులు' (రాత్రి 9 గంటలకు).

'మూడవ క్లాసు పెట్టె ఎప్పటిలాగే దేశ సౌభాగ్యాన్ని ప్రతిఫలిస్తోంది' (ఏమీ లేదు). సమకాలీన సమాజంపై తిలక్ అభిప్రాయాన్ని ఇలాంటి వ్యాఖ్యలు నిర్ధారిస్తాయి.

## పురుషలు

మనకు మధ్యమపురుషలో అరుదుగాను, ఉత్తమపురుషలో తక్కువగాను, ప్రథమపురుషలో అధికంగాను కథనం చేయడం తెలుసు. తిలక్ కథల్లో కూడా ప్రథమపురుష కథలే ఎక్కువ. 'లిబియా యెడారిలో', 'అద్దంలో జిన్నా బాబు', 'గడియారపు గుండెలు' మొదలైన ఒక కథలు ప్రథమపురుషలో సాగాయి. తిలక్ మానవత్వం కథలకు ఈ శిల్పం ఎంతగానో ఉపకరించింది.

> మనకు మధ్యమపురుషలో అరుదుగాను, ఉత్తమపురుషలో తక్కువగాను, ప్రథమపురుషలో అధికంగాను కథనం చేయడం తెలుసు. తిలక్ కథల్లో కూడా ప్రథమపురుష కథలే ఎక్కువ.

తిలక్ నడిపిన ఉత్తమపురుష కథల్లో కథకుడు 'ఓడిపోయిన మనిషి', 'నల్లజర్ల రోడ్డు', 'హోటెల్లో' వంటి కథల్లో కన్పిస్తాడు. అయితే ఈ ఉత్తమపురుష కథలు కూడా రెండు రకాలుగా కన్పిస్తాయి. 'నల్లజర్ల రోడ్డు' వంటి కథల్లో తాను పాత్రగా వుంటూ వేరే ప్రధాన పాత్రలు చేత మాట్లాడిస్తాడు. ఇక 'హోటల్లో' వంటి కథల్లో కథకుడు తాను సాక్షీభూతుడుగా వుంటూ, తాను నలుగుతూ వుంటాడు. అయితే, ఉత్తమపురుష కథనం వల్ల కొన్ని చిక్కులుంటాయని, కథలో 'నేను' ఎవరు అని తెలుసుకొనేందుకు పాఠకుడికి ఇబ్బందిగా వుంటుందని విమర్శకుల అభిప్రాయం. కానీ, తిలక్ కథల్లో అలాంటి సమస్య రాదు. ఉత్తమపురుష పాత్ర ప్రవేశంచగానే ఎవరు ఆ పాత్ర అనేది అర్థమైపోతుంది.

## స్థల - కాలాలు

కథ జరిగిన కాలాన్ని, ప్రాంతాన్ని నర్మగర్భంగా కథలో ఇమడ్చడం సజీవ కథల లక్షణం. కేవలం కల్పిత కథల్లో స్థల కాలాల విషయంలో కథకుడు దొరికిపోతాడు. తిలక్ కథల్లో స్థల కాలాల విషయంలో కథకుడు దొరికిపోతాడు. తిలక్ కథల్లో కల్పనలు వున్నా వాస్తవికత పాలు ఎక్కువ. అందుకే స్థల కాలాల శిల్పంలో భాగంగా స్పష్టంగా కన్పిస్తాయి. 'సముద్రపు అంచులు' కథ అంతా సముద్ర తీర ప్రాంతంలో జరిగింది. ఆ ప్రాంత ప్రజల సమస్త జీవనాన్ని అందులో ప్రతిబింబిస్తుంది. అలాగే 'నల్లజర్ల రోడ్డు' కథ అంతా అటవీ ప్రాంతంలో సాగినట్లు నేరుగానే అర్థమౌతుంది.

ఇక తిలక్ కథల్లో కాలం విషయానికొస్తే 'అద్దంలో జిన్నా' పాకిస్థాన్ విడిపోయిన కాలానిదని అర్థమౌతుంది. అలాగే 'ఓడిపోయిన మనిషి' కథలో 'భావకవిత్వం మీదా సుభాష్ చంద్రబోస్ నాయకత్వం మీదా మోజు, ఇంగ్లీషు వాళ్ళన్నా, ఉద్యోగస్తులన్నా చిరాకు' వంటి మాటలు కథాకాలం 1940-47 మధ్య అని అర్థమౌతుంది. ఇలాంటి ఎన్నో సందర్భాల్లో ఈ శిల్పాన్ని నేర్పుగా ప్రదర్శించాడు తిలక్. సంఘర్షణ దీన్నే ఇంగ్లీషులో 'కాన్ఫ్లిక్ట్' అంటాం. ఇతర భాషా సాహిత్యాన్ని బాగా చదివిన తిలక్ ప్రతి కథలోను ఈ శిల్ప లక్షణాన్ని అన్వయించాడు. తిలక్ కథలో ఒకే పాత్రలో గాని, రెండు పాత్రల మధ్య గాని ఈ సంఘర్షణ స్పష్టంగా కన్పిస్తుంది. ఒక్కొక్కసారి సమాజంలో వైరుధ్యాలు, మనుషుల్లో వైరుద్యాలు, భావ వైరుద్యాలు రూపంలో కూడా ఈ సంఘర్షణ తిలక్ కథల్లో కనిపిస్తుంది. ఒకే పాత్రలో చిన్న విషయమై చెలరేగిన మథనం 'ఫలిత కేశం' కథలో భార్య పాత్రలో ప్రవేశించి మరణానికి కారణమైంది. సీతాపతి కథలో ప్రధాన పాత్రలో ఆరంభమైన విరోధ భావం చివరికి అతన్ని అసహాయుడిని చేసి, తిరిగి భార్య దగ్గరకే చేరుస్తుంది. 'బాబు' కథలో ఒక యువకునితో ఆరంభమైన బ్రతుకు సంఘర్షణ చివరికి యజమానిపై తిరగబడి దాడి చేసే స్థాయికి వెళ్తుంది. 'యవ్వనం' కథలో విశాలలో ఆరంభమైన శారీరక సంబంధ కోరకల ఊగిసలాట కొనసాగి, చివరికి అప్రయత్నంగా వేరే వ్యక్తికి లొంగిపోతుంది. పొరపాటు జరిగిందని తెలుసుకుంటుంది. 'ఊరి చివర యిల్లు' కథలో మంచి జీవితం కోసం తపనపడే యువతి, ఆమె యవ్వనాన్ని ఉపయోగించుకొని బ్రతకాలని దురాలోచన చేసే ముసలి స్త్రీ రెండు పాత్రల మధ్య సంఘర్షణ శిల్పాన్ని ఆద్యంతంగా చూపించాడు తిలక్. 'సముద్రపు అంచులు' కథలో వ్యవస్థకు, వ్యక్తికీ మధ్య సంఘర్షణ కన్పిస్తుంది. ఎలాగైనా కష్టపడి చేపలు పట్టి సంపాదించి, సొంత ఇంటిని కట్టుకొని చంద్రిని పెళ్ళిచేసుకొని బ్రతకాలనే వీరూ, పైకి ఎదగాలనే అతన్ని సమాజంలో కొందరు భూవాలు కష్టాల పాలు చేసి యధాస్థితిలో వుంచడం కన్పిస్తుంది. తిలక్ కథల్లో మానసిక సంఘర్షణలు ఎక్కువగా కన్పిస్తాయి.

## ముగింపులు

కథలో ఎత్తుగడ పాఠకుణ్ణి కథలోకి జొరబడేలాగా చేస్తే, ముగింపు ఉత్కంఠత నుండి పాఠకుణ్ణి విముక్తి చేసేలా వుంటుంది. అయితే తిలక్ కథల్లో ముగింపులు సందేహాత్మకంగా వుండవు. పూర్తిగా అర్థమయ్యేలా వుంటాయి. 'తల లేనోడు' కథలో ముగింపు విషయంలో ఎన్నో చర్చలు. కొన్ని కథల్లో అస్పష్ట ముగింపులు కథా శిల్పాన్ని దెబ్బతీస్తాయి. కథ చివరకొచ్చేసరికి ఏం జరగబోతుందో తిలక్ ప్రతి

కథలోను తెలియజేస్తాడు. అలాగే ముగింపుల్లో సందేశాత్మక, ఆలోచనాత్మక, ఆశావాద, ప్రతీకాత్మక, వ్యంగ్యాత్మక, కవితాత్మక, కరుణాత్మక భావాల్ని చూపించి మంచి శిల్పంతో కథల్ని పూర్తి చేశాడు. దొంగ అనే విషయం పాఠకులకు మాత్రం తెలిసేటట్టు, కథలో భార్యా భర్తలకు అతను ఎందుకు వచ్చాడో తెలియనట్టు కథ నడిపిస్తాడు. చివరకు అతణ్ణి ఎవరో చెప్పమని స్త్రీ పాత్ర అడిగినపుడు "నేనా... నేనా" అని ఏమి చెప్పాలో ఆలోచించి చివరకు 'నన్ను గోపాలం అంటారు లెండి. అంతే' అంటూ గోపాలం తలెత్తకుండా వడి వడిగా పెరట్లోకి, చీకట్లోకి వెళ్ళిపోయాడు." అని ముగిస్తాడు కథకుడు. దొంగ గోపాలం కాదు ఆమె భర్త అనే సందేశాన్నిస్తూ ముగింపు వాక్యాల్ని రాశాడు తిలక్. 'ఓడిపోయిన మనిషి' కథలో వ్యక్తి ప్రేమించిన బాలని స్వార్థం కోసం వదిలేసి, సుభద్రను పెళ్ళిచేసుకొంటాడు. అన్నీ వున్నా అభద్రతా భావంతో ఇష్టమైన స్త్రీని, జీవిత భాగస్వామిని ఎంచుకోలేకపోతాడు. 'చదువు సంధ్యాలేని సుబ్బులు ద్వారా గుణపాఠం నేర్చుకున్న ఆ వ్యక్తి జీవితపు పందెంలో ఓడిపోయిన వాడిని' అనడంతో కథ పూర్తవుతుంది. ఇది గొప్ప సందేశాత్మక ముగింపు. 'పరివర్తన' కథలో శంకరం తన ఆలోచనా విధానాన్ని మార్చుకొని తాను ప్రేమించిన రాజేశ్వరితో "నీకోరిక ప్రకారం పెళ్ళి చేసుకొని సతీమణితోనే నీకు మళ్ళీ కనిపిస్తాను!" అనే ముగింపు వాక్యాల్లో మంచి సందేశాన్ని ఇమిచ్చాడు తిలక్. 'దేవుణ్ణి చూసిన వాడు' కథలో పరమ కఠినాత్ముడుగా, పిసినారిగా ఉన్న గవరయ్య లేచిపోయిన తన భార్యను ఆమె ఎవరి ద్వారానో కన్న బిడ్డను స్వీకరించడం గొప్ప మార్పు. పైగా 'నా కంటె సగం చిన్నదాన్ని పెళ్ళి చేసుకుంటే లేచిపోక ఏం చేసేది." అని సమర్థించడం సందేశాత్మక ముగింపుగా అర్థమౌతుంది.

అదేవిధంగా 'బొమ్మ' కథలో రోడ్ల జనం గుంపులుగా ఏర్పడడానికి, లాఠీచార్జి జరగడానికి కారణం అందమైన స్త్రీ రూపం. కానీ పేపర్లో వచ్చిన వార్తతో కథను ముగిస్తాడు. 'నగరంలో ప్రజా విప్లవం. పోలీసులు తుపాకీలు కాల్చారు. నగరంలో మతకలహాలు ముగ్గురి మరణం.' అంటూ పాఠకుడిలో ఆలోచనలు ముడివేసి ముగిస్తాడు. 'సీతాపతి కథ'లో చివరికి తప్పు తెలుసుకున్న వ్యక్తి 'పద్మ దేవత' అని డైరీలో రాసుకుంటాడు. అదే వ్యక్తి మొదట్లో తన భార్యను 'చంపెయ్యాలి' అని రాసుకుని వుంటాడు. అందుకే రచయిత ఇలాంటి ఆశావాద ముగింపునిచ్చాడు. 'నవ్వు' కథ ముగింపులో "అతని కథ వెనకాల భయంకర విషాదముంది, వేదాంతం వుంది." అవే మాటల వెనకాల ఆశావాదం శిల్పం వుంది. ఎన్ని కష్టాలు వచ్చినా మనిషి చిరునవ్వుతో వుండాలనే రచయిత ఆశ కన్పిస్తుంది. అలాగే 'కవుల రైలు' అనే స్కెచ్ లో కవులతో నిండి రైలులో స్థానం

> ఎన్ని కష్టాలు వచ్చినా మనిషి చిరునవ్వుతో వుండాలనే రచయిత ఆశ కన్పిస్తుంది. అలాగే ‘కవుల రైలు’ అనే స్కెచ్ లో కవులతో నిండి రైలులో స్థానం లేకపోయిన స్త్రీ ఎవరు? అనే ప్రశ్నకు చివరగా ‘కవిత’ అనే వ్యంగ్యాత్మక సమాధానాన్నిచ్చి ముగిస్తాడు తిలక్.

లేకపోయిన స్త్రీ ఎవరు? అనే ప్రశ్నకు చివరగా ‘కవిత’ అనే వ్యంగ్యాత్మక సమాధానాన్నిచ్చి ముగిస్తాడు తిలక్. అదే విధంగా ‘ఐనా రక్తపు మరక పడిన చొక్కా దానికి నిదర్శనం’ (హోటల్లో), ‘అద్దంలో జిన్నా చాల గొప్పవాడు. చాలా గొప్పవాడి కన్నా గొప్పవాడు. జిన్నా వెనుక పదికోట్ల మహమ్మదీయులు, ఇరవై కోట్ల కళ్ళల్లో....” (అద్దంలో జిన్నా) వంటి ప్రతీకాత్మక ముగింపులున్నాయి. అలాగే ‘కృష్ణ పక్షపు గుడ్డివెన్నెల్లో ఆ నగరం తనలో తానొదిగిన పెద్ద తాబేలులా వుంది.” (కదిలే మేడలు), ‘అందమైన మొహం మీద పడే నల్లని వదిలిన జుట్టుని చూసేటప్పటికి ఆమె కనుకొలకుల్లో తెల్లని నీటి బిందువు తళతళ లాడింది” (నిర్మల మొగుడు) వంటి కవితాత్మ ముగింపులున్నాయి. తిలక్ అనేక కథల్లోని అనేక సన్నివేశాలు పాఠకుల చేత కన్నీరు పెట్టిస్తాయి. అలాగే కొన్ని ముగింపులు చూసినప్పుడు పాఠకుడికి అక్షరాలు మసకబారుతాయి. అదే శిల్పంలో తారాస్థాయి. ‘ఊరిచివర ఇల్లు’ కథ ముగింపులో రమ తనను విడిచి వెళ్ళిపోతున్న జగన్నాథం ఉన్న రైలు దగ్గరకు వెళ్తుంది. ఏమీ మాట్లాడలేక వెళ్తున్న రైల్లోకి అతను విడిచిన డబ్బున్న పర్సును రైల్లోకి విసిరి తాను పడిపోతుంది. తన తప్పులేక పోయినా, తనను అలా మార్చిన వ్యవస్థను ఏమీ అనకుండా నేల కరుచుకుని, బురదలో ఉండిపోయిన స్త్రీ రూపాన్ని చూపిస్తూ కరుణరసాత్మకంగా ముగిస్తాడు తిలక్. అలాగే ‘సముద్రపు అంచులు’ కథలో వీరా, చంద్రిల దీనావస్థను చూస్తూ హృదయం కదిలే ముగింపు నిస్తాడు.

ఈ విధంగా తిలక్ కథల్లో శిల్పాన్ని సౌందర్యవంతంగా సిద్ధం చేయడానికి అనేక నిర్మాణ పద్ధతులను ఉపయోగించాడు. తిలక్ శిల్పరీతుల్ని చూశాక కథల్ని ఇలా తప్ప మరో విధంగా చెప్పలేం అనిపిస్తుంది. కథలో ఉండవలసిన వాటిని మాత్రమే వుంచాడనిపిస్తుంది.

> రాయకూడని విషయాన్ని ఎక్కడా రాయలేదు. కథ ఎన్ని పుటల్లో వుండాలనే నియమాలు ఆయన్ని ఏమీ చేయలేకపోయాయి. ఒక పుట కథ నుండి 30 పుటల కథల దాకా వున్నాయి. కథలన్నీ నేరుగా మొదలై నేరుగానే పూర్తవుతాయే గానీ, ఫ్లాష్ బాక్ తో సాగవు.

రాయకూడని విషయాన్ని ఎక్కడా రాయలేదు. కథ ఎన్ని పుటల్లో వుండాలనే నియమాలు ఆయన్ని ఏమీ చేయలేకపోయాయి. ఒక పుట కథ నుండి 30 పుటల కథల దాకా వున్నాయి. కథలన్నీ నేరుగా మొదలై నేరుగానే పూర్తవుతాయే గానీ, ఫ్లాష్ బాక్ తో సాగవు. అన్నిటికంటే కథను నిర్మించే క్రమంతో సంగీత, సాహిత్య, రాజకీయ, సామాజిక, ఆర్థిక అంశాలతో మేళవించాడు. అందుకే తిలక్ కథాశిల్పం సౌందర్యాత్మకంగా భాసించింది. 1967 తర్వాత వెలుగు చూసినా 'విశ్వసాహిత్యంలో ఉత్తమ కథలతో దీటు వచ్చే కథలు" అన్న నిడమర్తి ఉమారాజేశ్వరరావు మాటలు వాస్తవం.

**ఆధార గ్రంథాలు:**

(1.) కథలెలా రాస్తారు (వ్యాసం) - తిలక్ (2.) కవికుల తిలకుడేనా తిలక్? కాదు కథకుల కస్తూరి తిలకం గూడా! - (వ్యాసం) - మునిపల్లె రాజు (3.) తెలుగు కథకు కథన రీతులు (1 వ్యాల్యూమ్) - వ్యాసం - కోడూరి శ్రీరామమూర్తి (4.) మనం మరచిపోతున్న మంచి కథకుడు తిలక్ - అంపశయ్య నవీన్ (తిలక్ సాహితీ సందర్శము) (5.) కథానిక శిల్పం - వల్లంపాటి వెంకట సుబ్బయ్య (6.) కథానిక స్వరూప, స్వభావాలు - పోరంకి దక్షిణా మూర్తి (7.) కథలు ఇలా కూడా రాస్తారు - మహమ్మద్ ఖదీర్ బాబు (8.) నా కథల నాయికలు (వ్యాసం) - శార్వారి (కథలెలా రాస్తారు) (9.) తిలక్ కథలు - (మొదటి ముద్రణ ముందు మాటలు) - 1967, విశాలాంధ్ర.

(మొదటి భాగం జనవరి-మార్చి సంచిక లో ప్రచురితమైనది)

# అసమర్థుని జీవయాత్ర - సీతారామరావు పాత్ర



**- ఆచార్య డి.వి.శ్రవణ్ కుమార్**
ప్రొఫెసర్-కం-డైరెక్టర్ ప్రచురణల కేంద్రం
ద్రావిడ విశ్వవిద్యాలయం, కుప్పం
94926 34686, 89191 78955

ఆధునిక తెలుగు సాహిత్యంలో ఒక ప్రత్యేకమైన గుర్తింపు గలిగిన రచయిత త్రిపురనేని గోపీచంద్. ప్రముఖ రచయిత, హేతువాది త్రిపురనేని రామస్వామి చౌదరి గారి కుమారుడు గోపీచంద్ సెప్టెంబరు 8, 1910 సంవత్సరంలో జన్మించారు. ఈయన రచించిన అనేక కథలు, నవలలు, నవలికలు, నాటకాలు ఇతర రచనలు తెలుగు సాహిత్యంలో గోపీచంద్ స్థానాన్ని తెల్పుతాయి. వీరి తండ్రి రామస్వామి చౌదరి గారి హేతువాద దృక్పథం ప్రభావం గోపిచంద్ పై కనపడుతుంది. వాడుక భాషలో చిన్న, చిన్న వాక్యాలలో, తెలుగు నుడి కారంతో చురుక్కుమన్పించే వ్యంగ్యోక్తితో, సులభశైలిలో రాయడం గోపీచంద్ ప్రత్యేకత.

తెలుగు సాహిత్య ప్రక్రియల్లో బాగా ప్రజాదరణ పొందిన ప్రక్రియ నవల. ఒక కాల్పనిక రచనగానే కాకుండా, యథార్థ మానవ జీవితాన్ని సమగ్రంగా ఆవిష్కరించడానికి సరైన మాధ్యమం నవలా ప్రక్రియ. ఇందులో చారిత్రక, రాజకీయ, ఆర్థిక, సామాజిక, నైతిక, తాత్విక మనస్తత్వాలను సమగ్రంగా చిత్రించవచ్చు.

గోపీచంద్ మొత్తంగా మూడు సంపూర్ణ నవలలు, ఐదు నవలికలను, మూడు అసంపూర్ణ నవలలను రచించారు. అలాగే ఐదుగురు రచయితలతో కలిసి ఒక గొలుసుకట్టు నవలను రచించారు. 'పరివర్తన', 'అసమర్థుని జీవయాత్ర', 'పండిత పరమేశ్వర శాస్త్రి వీలునామా' అనే నవలలను సంపూర్ణంగా రచించారు. 'పిల్ల తెమ్మెర', 'మెరుపుల మరకలు', 'గడియ పడని తలుపులు', 'శిథిలాలయం', 'గతించని గతం' అనే ఐదు నవలికలు రచించారు. అలాగే చీకటి గదులు, ప్రేమోపహతులు, యమపాశం అనే మూడు నవలలు అసంపూర్ణంగా మిగిలిపోయాయి.

త్రిపురనేని గోపిచంద్ కి గొప్ప పేరు ప్రఖ్యాతులు తీసుకువచ్చిన నవల 'అసమర్థుని జీవయాత్ర'. ఈ నవలను 1947లో రచించారు. పూర్తి హేతువాద దృక్పథంతో, తాత్విక దృక్పథంతో రచించిన నవల ఇది. ఇందులో ప్రధాన పాత్ర సీతారామారావు.

కథావస్తువును భరించేవి, కథని నడిపించేవి పాత్రలే. కథ లేని నవల ఉంటుందేమో గానీ, పాత్రలు లేని నవలలు ఉండవు. ఇంగ్లీషులో ఇ.ఎం. ఫాస్టర్ పాత్రల్ని "ఫ్లాట్ క్యారెక్టర్స్", "రౌండ్ క్యారెక్టర్స్" అని రెండు రకాలుగా విభజించాడు. అదే మానసిక శాస్త్రవేత్తలు పాత్రల్ని 'టైప్స్', 'ఇండివిజ్యువల్స్' అని విభజించారు. తెలుగులో వీటికి సమానార్థకాలుగా 'క్లిష్టత లేని పాత్రలు', 'క్లిష్టత ఉన్న పాత్రలు' అని చెప్పుకోవచ్చు. ఒక భావాన్నో, ఒక గుణాన్నో ఆధారం చేసుకుని రూపొందించబడ్డ పాత్రల్ని 'క్లిష్టత లేని పాత్రలు' లేదా 'ఫ్లాట్ క్యారెక్టర్' అని చెప్పవచ్చు. నవలా సాహిత్యంలో ఎక్కువగా క్లిష్టత లేని పాత్రలే కనిపిస్తాయి. పాఠకుడు క్లిష్టత లేని పాత్రల్ని గుర్తుంచుకోవడం చాలా తేలిక.

రచయిత పాత్రల ప్రవర్తన ఆధారంగా కథను అల్లుకుంటూపోతాడు. తగిన సమయంలో తగిన చోట పాత్రల్ని ప్రవేశపెట్టాడు. ఒక పాత్రను చక్కగా సజీవంగా మలచడం రచయిత ప్రతిభపైన ఆధారపడి ఉంటుంది. అటువంటి పాత్రలు చిరస్థాయిగా పాఠకుల హృదయాల్లో నిలిచిపోతాయి. వ్యక్తి ప్రవర్తనకు అతని గుణగణాలు, భౌతిక పరిస్థితులూ కారణమనే సూత్రమాధారంగా పాత్ర పోషణ జరగడం సహజంగా ఉంటుంది. మానవ జీవితంలోలాగే నవలల్లోని పాత్రలకు కూడా భౌతిక జీవితంతో పాటు మానసిక జీవితం కూడా ఉంటుంది. రచయిత తన నవల ద్వారా ఏ అంశాన్ని ప్రతిపాదించదలచుకుంటాడో ఆ అంశాన్ని ఆవిష్కరించేవి ప్రధాన పాత్రలు.

"రచయిత పాత్రల ప్రవర్తన ఆధారంగా కథను అల్లుకుంటూపోతాడు. తగిన సమయంలో తగిన చోట పాత్రల్ని ప్రవేశపెట్టాడు. ఒక పాత్రను చక్కగా సజీవంగా మలచడం రచయిత ప్రతిభపైన ఆధారపడి ఉంటుంది. అటువంటి పాత్రలు చిరస్థాయిగా పాఠకుల హృదయాల్లో నిలిచిపోతాయి."

'అసమర్థుని జీవయాత్ర' నవలలో ప్రధాన పాత్ర, నవలా కథానాయకుడు సీతారామారావు. ఇతను హేతువాది. జీవితంలో ప్రతి విషయాన్ని హేతువాద దృక్పథంతో చూడాలనే తత్వం ఉన్నవాడు. మంచి ఉన్నత కుటుంబంలో జన్మించాడు. తాత - తండ్రుల లక్షణాలన్నీ చక్కగా పుణికిపుచ్చుకున్నాడు. ధనం కన్నా కీర్తి ప్రతిష్టలే ముఖ్యమని భావించే వంశం. ఆ వంశ ప్రతిష్ట కోసమే సీతారామారావు పూర్వీకులంతా దానధర్మాల రూపేణా ఆస్తి కరిగించేశారు. అందరితో ధర్మాత్ములని పొగిడించుకున్నారు. సీతారామారావు తండ్రి మరణశయ్య మీద ఉండి మన వంశం పేరు నిలబెట్టమని కొడుకుని కోరాడు. సీతారామారావు చిన్నతనం నుండి తన కుటుంబం గురించి చాలా మంది గొప్పగా చెప్పుకోవడం విన్నాడు. అందుకే తండ్రి ఉత్తర క్రియలకు పదివేల రూపాయలు ఖర్చు పెట్టి ఘనంగా చేశాడు. ఊరంతా తండ్రికి మించిన చెయ్యి అని పొడిగారు. తండ్రి మరణం తర్వాత అప్పుల వాళ్ల విషయంలోనూ ఉదారంగా వ్యవహరించాడు. తన మేనమామ తనకు ఇవ్వవలసిన నలభై వేల రూపాయలు బాకీ కింద పదివేలు విలువచేసే పదెకరాలు మాత్రమే రాయించుకున్నాడు. ఆ విధంగా ఒకరికి సహాయపడాలంటే ఆనందంగా ఉండేది సీతారామారావుకి. తండ్రి కోరిక నెరవేరుస్తున్నాననే సంతోషం, వంశం పేరు నిలబెడుతున్నారనే గర్వం ఉండేది ఆ రోజుల్లో.

చిన్నతనంలో సీతారామారావుకి చాలా ఉన్నతమైన ఆశయాలుండేవి. నిత్య జీవితానికి అతీతంగా ఆదర్శ జీవితం గడపాలని భావించేవాడు. పెళ్లి, పిల్లలు, వారి కోసం తాపత్రయపడటం నచ్చేది కాదు. అందరిలా కాకుండా పెళ్లికి ఒక కొత్త అర్థం చెప్పాలనుకున్నాడు. గురుకులంలో చదివే ఇందిరను ప్రేమించి, పెళ్లి చేసుకున్నాడు. పిల్లల్లేకుండా జాగ్రత్త పడాలనుకున్నాడు. అనుకున్నట్లు జరగకపోగా, సంవత్సరంలోనే ఒక ఆడపిల్ల పుట్టింది. అయిదేళ్లలో ఇద్దరు పిల్లలు కలిగారు. ఆస్తి హారతి కర్పూరం కావడంతో మేనమామ సిఫార్సుతో ఉద్యోగం చేయక తప్పలేదు. సీతారామారావు దగ్గర సహాయం పొందిన వారు అతనితో మాట్లాడటం మానేశారు. గొడవపడి ఉద్యోగమూ పోగొట్టుకున్నాడు. ఊళ్లో వాళ్లంతా నిందించడం మొదలు పెట్టారు. ప్రపంచం మీద కసి పెంచుకున్నాడు. ఆ కసికి తరచూ తన భార్య గురవుతూ ఉండేది. తమ కుటుంబాన్ని అభిమానించే రామయ్య తాత హితవునూ లెక్కచేయలేదు. ఎప్పుడూ ముసుగు తన్ని పడుకుని, ఆలోచిస్తూ ఉండేవాడు. తన ఆలోచనల్లో ఏ ప్రశ్నకు జవాబు దొరికేది కాదు.

ఇంట్లో పనీపాటా లేకుండా కూర్చున్న సీతారామారావుకి ఎన్నో పగటి కలలు వస్తుండేవి. దరిద్రం అనుభవిస్తున్న సీతారామారావుకి జీవితం దుర్భరమైంది.

ఇంతకుముందంతా తనని పొగిడిన వాళ్లంతా, ఈనాడు తనని అసమర్థుడని అనడం తీవ్రంగా బాధించింది. అతనికి అతని భార్య అంటే చాలా ప్రేమ. ఆమెను సుఖ పెట్టలేకపోతున్నానని బాధపడతాడు. అయితే, ఆమెని మానసికంగా హింసించేవాడు. ఆమెను, ఆమె తండ్రినీ తిట్టిపోశాడు. కూతురంటే కూడా విపరీతమైన ప్రేమ. కారణం లేకుండానే ఆ అమ్మాయిని కొడుతుంటాడు.

భార్యతో ప్రేమగా మాట్లాడుదామని వెళ్లి కూడా, చేతగాక గొడవ పెట్టుకుంటాడు. అతనిలో అప్రయోజకత్వం, అసమర్థత సంసార జీవితంలో సుఖం లేకుండా చేశాయి. భార్యా పిల్లలకు ప్రేమానురాగాలు పంచలేని నిస్సహాయుడయ్యాడు. అతని ప్రవర్తనతో విసిగిపోయిన భార్య నిర్లిప్తంగా బ్రతకడం అలవాటు చేసుకుంది. కూతురు తండ్రి అంటేనే భయపడే స్థితికి చేరుకుంది. వీటన్నింటికీ తనలో తాను బాధపడతాడు గానీ సమస్యను పరిష్కరించేందుకు ప్రయత్నించడు.

ప్రతిదానికీ 'ఎందుకు' అని ప్రశ్నించుకునే సీతారామారావుకి జీవితం ఆలోచనలతోనే గడిచిపోసాగింది. ఈ లోకంలో జ్ఞాని కన్నా అజ్ఞానే ఎక్కువ సుఖపడుతున్నాడని భావించాడు. ఎందుకంటే అజ్ఞానిని ఏ ఆలోచనలూ వేధించవు. తనకు అందని ఆదర్శాలతో హైరానా పడడని అనుకున్నాడు. ఇలా అనేక రకాల ఆలోచనలతో బాధపడి చివరికి అసలు ఆలోచించడమే తప్పనే నిర్ణయానికొచ్చాడు. చిన్న చిన్న విషయాల గురించి ఎక్కువగా ఆలోచించడమే తన సమస్యలకు కారణం అనుకున్నాడు. సీతారామారావుకి ఒకసారి ఒక అభిప్రాయం మంచిగా కనిపిస్తే, మళ్లీ మరొకటి మంచిగా అన్పిస్తుంది. ఒక పని చేద్దామని మొదలు పెట్టి, అనుకోకుండా దానికి వ్యతిరేకంగా పని చేస్తాడు. మళ్ళీ ఈ రెంటిలో ఏది మంచిదని ఆలోచిస్తాడు. అసలు ఏదో ఒకటి చెయ్యాలనుకోవడంతోనే ఈ సమస్యలన్నీ వస్తున్నా యేమోనని అనుకుంటాడు. తల నిండా ప్రశ్నలకు జవాబు దొరక్క ముసుగు తన్ని పడుకుంటాడు. ఇలా ఏదీ చెయ్యలేని అసమర్థుడిగా మిగిలిపోయాడు.

మనిషి నిర్నిమిత్తంగా పుట్టాడని భావించాడు. కారణం లేకుండా బ్రతకడానికి వీలైతే బ్రతకడం, లేదంటే చావడమేనని మానవ జీవితాన్ని సీతారామారావు సిద్ధాంతీకరించాడు. ఈ సిద్ధాంతం అతని అసమర్థతని పరాకాష్ఠకి తీసుకెళ్ళింది. తన చేతకాని తనాన్ని కప్పిపుచ్చడానికి మనిషిని నిర్నిమిత్తుడిగా చేసి తనను తాను సమర్థించుకున్నాడు.

ఇటువంటి మానసిక స్థితిలో ఉన్న సీతారామారావు తన బాధలు భరించలేక ఓదార్పు పొందడానికి తన భార్య దగ్గరకు వెళతాడు. అయితే అక్కడ ఆమెను

మాటలతో హింసించి, తన అసమర్థతను కప్పిపుచ్చుకోడానికై ఆమెపై చేయి చేసుకుంటాడు. తనలోని మంచి మనిషి ఆమెను ప్రేమించాలనుకుంటాడు. కానీ తనలోని అసమర్థుడు ఆమెను హింసిస్తాడు. ఒక పక్క మంచిది కాదని అనుకుంటూనే, మరోపక్క అదే చేస్తుంటాడు. ఇది సీతారామారావులోని ద్వంద్వ వైఖరికి అద్దం పడుతుంది. దీనికి కారణమేమిటని ఆలోచిస్తాడు. పదార్థానికీ, ఆత్మకీ ఉన్న సంఘర్షణ అయితే తానెవ్వరని ప్రశ్నించుకుంటాడు. పదార్థమా లేక ఆత్మనా లేక రెండూనా అని అనుకుంటాడు. చివరికి పదార్థమే బలమైందిగా విశ్వసిస్తాడు. తనలోని మనిషిని గెలిపించాలనుకుని అసమర్థుడికే పట్టం కడతాడు. చివరకు తనలోని సమర్థుడికి - అసమర్థుడికి జరిగే సంఘర్షణలో ఎప్పుడూ అసమర్థుడే గెలుస్తుంటాడు. భార్యను కొట్టి హింసించడంలో ఈ వైఖరి స్పష్టమవుతుంది.

భార్యను కొట్టిన తర్వాత సీతారామారావుకి తనపై తనకే అసహ్యమేసింది. అక్కడ ఉండలేక ఆలోచించుకుంటూ బజారునపడ్డాడు. తన దుస్థితికి కారణాలు తర్కించుకుంటూ రామయ్య తాత వద్దకి వెళ్లాడు. అక్కడా గొడవ పడ్డానికి ప్రయత్నించాడు.

రామయ్య తాత చీదరించుకున్నాడు. పిచ్చి పట్టినట్లయిన సీతారామారావు చివరకు స్మశానం చేరుకున్నాడు. తల్లిదండ్రుల సమాధుల వద్ద ఆత్మ సంఘర్షణ మొదలైంది. తర్క వితర్కాల అనంతరం తనను తాను హింసించుకుని ఆత్మహత్య చేసుకున్నాడు. సీతారామారావు పాత్రలో మనకు ఎన్నో సంఘర్షణలు కన్పిస్తాయి. వారసత్వంగా వచ్చిన భావాల మధ్య సంఘర్షణ, హేతువాద జ్ఞానానికి - సహజ జ్ఞానానికి మధ్య సంఘర్షణ, ఆదర్శానికి - ఆచరణకీ మధ్య సంఘర్షణలన్నింటిలోనూ సీతారామారావు అసమర్థుడిగానే మిగిలాడు. తన ఓటమికి సమాజంపై కసి పెంచుకుని, మనుషులపై తీర్చుకోలేని కసి తన మీద తనే తీర్చుకున్నాడు. అసమర్థుని జీవయాత్ర చివరికిలా ముగిసింది. ఈ నవలలో సీతారామారావు పాత్రని గోపీచంద్ మలచిన తీరు అజరామరం.

## ఆధార గ్రంథాలు:

1. అసమర్థుని జీవయాత్ర - త్రిపురనేని గోపీచంద్
2. గోపీచంద్ అసమర్థుని జీవయాత్ర - ఒక పరిశీలన - కె.బాబూరావు (ఎం.ఫిల్. సిద్ధాంత వ్యాసం)
3. గోపీచంద్ రచనలు - మానవతావాదం (సిద్ధాంత గ్రంథం) - ఆవుల మంజులత



# తమిళనాట తెలుగువారి వలస జీవన కావ్యం కీ.రా. 'గోపల్లె'

- డా. తుర్లపాటి రాజేశ్వరి
✆ 90787 43851

కీ.రా. పూర్తి పేరు రాయంకుల కృష్ణ రాజనారాయణ పెరుమాళ్ రామానుజ నాయకర్. ఎనిమిది శతాబ్దాల క్రిందట ఉత్తరాన వున్న ఆంధ్ర ప్రాంతం నుంచి తమిళనాడు పాండ్య మండలం (కరిచల్‌కాడు : నల్లరేగడి నేల)కు వలస వెళ్ళిన కుటుంబానికి చెందినవారు. వీరు తూత్తుకూడి జిల్లా కోవిల్పట్టి మండలం, ఇడైచేవల్ గ్రామంలో 1923 సెప్టెంబర్ 16వ తేదీన శ్రీ కృష్ణరామానుజం, లక్ష్మీ అమ్మ దంపతులకు జన్మించారు. 1965 నుంచి రచనా వ్యాసంగం ప్రారంభించి కీ.రా.గా తమిళుల ఆదరాభిమానాలు చూరగొన్నారు. తమ కుటుంబం తెలుగు ప్రాంతం నుంచి తమిళనాడుకు తరలివెళ్ళిన వైనం - తరతరాలుగా మౌఖికంగా అందివచ్చిన ఆవేదనామయ గాథను కీ.రాజనారాయణన్ నవలా రూపంలో మలచి 1976 లో 'గోపల్ల గ్రామం' పేరుతోనే తమిళంలో అక్షరబద్ధం చేశారు. ఈ నవలను తెలుగులోకి నంద్యాల నారాయణరెడ్డి అనువదించారు. కీ.రా. 'గోపల్ల గ్రామం'కి కొనసాగింపుగా 'గోపల్లె పురత్తు మక్కళ్' పేరిట రెండో నవలను వెలువరించారు. నాటి గోపల్లె శతాబ్దాల కాలంలో పరిణామం చెందుతూ స్వాతంత్ర్యోద్యమ కాలం నాటికి రూపుదిద్దుకున్న విధం 'గోపల్లె పురత్తు మక్కళ్' వివరిస్తుంది. దీనికి 1991లో కేంద్ర సాహిత్య అకాడెమీ పురస్కారం లభించింది. 1965లో వీరి తొలి కథా సంకలనం వెలువడింది. వర్షం లేక ఎండిన నేల తల్లి వెతలను అక్షరీకరించటంలో కీ.రా. సిద్ధహస్తుడు. 1984లో కీ.రా. 'కరిసై కథై గళ్' సంపుటానికి సంపాదకునిగా వ్యవహరించారు. తమిళనాడు టెక్స్ట్ బుక్ కార్పోరేషన్ (టి.ఎన్.టి.బి.) 'కరిసై కథై గళ్' ను ఆంగ్లంలోకి అనువదింపజేసి, 'హార్పర్ కొల్లిన్స్' వారిచే ముద్రింపజేశారు. ఈ పుస్తకం మార్చి 2021లో వెలుగు చూసింది. కథ, నవల, వ్యాసం - ఇలా పలు సాహితీ ప్రక్రియలలో రచనలు చేయటమే గాక తమిళ మాండలిక నిఘంటువు రూపొందించారు. జానపద సాహితీ పరిశోధకునిగా, గొప్ప రచయితగా పేరు పొందిన కీ.రా.ని పాండిచ్చేరి విశ్వవిద్యాలయం 'ఆచార్య' పదవినిచ్చి గౌరవించింది. వీరు మే 17వ తేది 2021న కన్నుమూశారు.

## 'గోపల్లె' ఇతివృత్తం



"ఆంధ్రప్రదేశ్‌లో తెలుగువాళ్ళు తమిళనాడుకు వలసపోవటానికి ఎన్నో రాజకీయ, సాంఘిక, మత కారణాలు కలవు. అందులో ఒకటి తురక రాజులు రాజ్యాంగం చేసేటప్పుడు మన ఆడవాళ్ళపై కన్నుపడి ఆశపడే కారణం చేత, ఆ రాజుల చేతిలో పడి మానాన్ని పోగొట్టుకోవటానికి ఇష్టపడక దక్షిణ దిక్కుకు పయనమై వచ్చారు)."

(నానుడి - కీ.రాజానారాయణన్ గోపల్లె నవల - ఆగష్టు 2013)

ఆంధ్రదేశంపై తురుష్కుల దండయాత్రలు క్రీ.శ. 1303 నుంచే ప్రారంభమైనాయి. క్రీ.శ. 1323లో ఢిల్లీ ప్రభుత్వ ఘియాజుద్దీన్ తుగ్లక్ కుమారుడు ఉల్లూఖాన్ ఓరుగల్లును జయించి ప్రతాపరుద్రుని ఓడించటంతో తెలుగుదేశం సంపూర్ణంగా ముస్లింల ఆధీనంలోకి వచ్చింది. క్రీ.శ. 1324 నాటికి తీరాంధ్రం ఢిల్లీ సామ్రాజ్యంలో చేరింది. ఆంధ్రుల చరిత్ర గ్రంథంలో డా. బి.ఎస్.ఎల్. హనుమంతరావు నాటి సామాజిక స్థితి గతులను ఇలా వ్రాశారు. 'తురుష్కుల పాలనలో ఆంధ్రులు అనేక కష్ట నష్టాలకు గురి అయ్యారు. పన్నుల భారం అధికమైంది. విద్వజ్జనుల అగ్రహారాలకు నష్టం వాటిల్లింది. ఆలయాలు, దేవతా ప్రతిమలు భగ్నమైనాయి.'

(ఆంధ్రుల చరిత్ర పుట - 228)

ఈ నేపథ్యంలో రాయంకుల వంశీకులు తమిళనాడుకు తరలి వెళ్ళిన కాలం ఎనిమిది వందల ఏళ్ళ క్రిందట అన్న కీ.రా. గారి మాటలను బట్టి అది 1310-1330ల మధ్య కాలానికి అటూ, ఇటూ అయి ఉండొచ్చని ఊహించవచ్చును. తమ ఆడబిడ్డలను రక్షించుకోవటానికి పరుగులు పెట్టిన తెలుగువారి గుంపు, అనేక మజిలీలు చేసుకుంటూ, అడవిదారుల వెంట నడిచీ నడిచీ తమిళనాడు కరిచల్‌కాడు అడవి ప్రాంతానికి చేరుకున్నారు. ఈ చోటులో అడవిని నరికి, ఈ ప్రాంతాన్ని పంటపొలాలుగా, వాసయోగ్యంగా తీర్చిదిద్దుకున్నారు. దానికి గోపల్లె అని పేరు పెట్టుకున్నారు.

ప్రభాత వర్ణనతో నవల ప్రారంభమౌతుంది. వెనువెంటనే కంసాలి వివాహిత హత్యోదంతం ఇది మళ్ళీ నవలాంతానికి గోపల్లెలో హంతకుడిని శిక్షించిన విధం - నవలలో చిత్రించబడింది. నవలలో ఈ నడుమ భాగంలో కథా సంవిధానం అబ్బురగొలిపే విధంగా సాగుతుంది. కథలో అతీతం వర్తమానం కలగాపులగంగా కలిసి నడుస్తూ ఉంటాయి. నాయనమ్మకి జరగబోయే అన్ని విషయాలు తెలుస్తూ ఉంటాయి. కథలో అద్భుతాలు జరుగుతూ ఉంటాయి. భారతీయ సంస్కృతి, వైదిక విజ్ఞానం, భారతీయ ఆత్మ ఆవిష్కరణ నవల అంతటా పరుచుకుని ఉంటుంది. అద్భుత మాయాజాలం - అద్భుతరసం పఠితకు విభ్రాంతిని కలిగిస్తుంది. కథా కథనం ఉత్కంఠను రగిలిస్తుంది. మహాభారతంలో వ్యాసమహర్షి ఇటువంటి అద్భుతాలు వందలకొలది వాఖ్యానాల్లో ఆవిష్కరించారు.

> మహాభారతంలో రాజసూయ మహోత్సవంలో శిశుపాలవధ ముఖ్యమైనది. గర్వితుడై తనను నిందిస్తున్న శిశుపాలుడిని శ్రీకృష్ణుడు ఇక నిన్ను క్షమించను అంటూ సుదర్శన చక్రాన్ని స్మరిస్తాడు. సుదర్శన చక్రం మెరుపువేగంతో వచ్చి శిశుపాలుడి శిరస్సుని ఖండిస్తుంది.

మహాభారతంలో రాజసూయ మహోత్సవంలో శిశుపాలవధ ముఖ్యమైనది. గర్వితుడై తనను నిందిస్తున్న శిశుపాలుడిని శ్రీకృష్ణుడు ఇక నిన్ను క్షమించను అంటూ సుదర్శన చక్రాన్ని స్మరిస్తాడు. సుదర్శన చక్రం మెరుపువేగంతో వచ్చి శిశుపాలుడి శిరస్సుని ఖండిస్తుంది. మరొక ఆశ్చర్యకరమైన సన్నివేశం ద్రౌపదీ వస్త్రాపహరణం లేక ద్రౌపదీ మాన సంరక్షణ. ఈ సన్నివేశంలో పాపాత్ముడైన దుశ్శాసనుడు ద్రౌపది చీర నిండు సభలో లాగుతున్నప్పుడు ద్రౌపది శ్రీకృష్ణుడిని ప్రార్థించగా, ఆమె శరీరం నుండి వివిధ వర్ణాల వస్త్రాలు వస్తూ సభాసదులను అలౌకిక స్థితికి తీసుకువెళ్ళటం! ద్రౌపదిని వివస్త్రను చేయలేకపోయి, దుశ్శాసనుడు అలసిపోయి కూర్చుండిపోవటం! పాశ్చాత్య సాహిత్యంలో దీనిని 'Magical Realism'! అంటున్నారు.

దీనిని ఫ్రాంజ్ రోహ్ అనే కళా విమర్శకుడు తనను ఆకర్షించిన చిత్రకళా శైలిని 'మాజికల్ రియలిజమ్' అనే పేరుతో పిలిచారు. 1940లో Alejo Carpenties అనే క్యూబన్ నవలా రచయిత సాహిత్యానికి అన్వయించాడు. పిమ్మట కొలంబియాకి చెందిన 'గాబ్రెల్ గార్షియా మార్క్వెజ్' తన రచనలలో 'మాజికల్ రియలిజమ్'ను ప్రయోగించాడు. సాహిత్యానికి నోబుల్ బహుమతి పొందిన ఈ రచయిత రచనలలో 'వన్ హండ్రెడ్ ఇయర్స్ ఆఫ్ సోలిట్యూడ్' నవల మాజికల్ రియలిజమ్‌కు ఉత్తమ ఉదాహరణగా నిలిచింది.

ఈ నవలలో ఫాదర్ నికోనార్ భగవంతుడి శక్తి నిరూపణ ఇదేనంటూ భూమికి ఆరడుగుల ఎత్తులో గాలిలో పైకి లేస్తాడు. (పుట- 85)

కల్నెల్ అరిలియానో బుయెండియా తల్లి ఉర్సులాకి దూరంగా ఉన్న కుమారుడి మరణం గూర్చి తెలుస్తుంది. ఆమెకు అటువంటి సూచనలు వస్తూ ఉంటాయి.

ఒక్క మార్క్వెజ్ మాత్రమే కాదు. పాశ్చాత్య సాహితీకారులు, భారతీయ రచయితలు ఈ ప్రక్రియలో రచనలు చేస్తున్నారు. కె. రాజనారాయణన్ గారి ఈ గోపల్లె నవల కూడా ఈ కోవకు చెందిన నవలే.

గుర్రాలదండు తమని తరుముతున్నప్పుడు జరిగిన అద్భుత సంఘటన జేజి గోవిందప్పతో చెబుతుంది. "ఏటికి అవతలిగట్టుపై గోపురం ఎత్తున ఒక పెనురావిమాను. అట్లాగే మేమున్న ఈ గట్టువైపు వంగింది.... మేము నిలుచున్న గట్టుకు దాని కొమ్మలను తాకించి కాసేపు ఉండి తిరిగి పైకి లేచింది. ఈ గట్టును తాకిన ఆ రావిమాను కొమ్మల మీదికి ఎక్కి పట్టుకొన్నాము." (పుట - 30) అలా ఎక్కిన వారినందరినీ ఆ రావిమాను కొమ్మ గట్టు ఆవతలిగట్టువేపు దింపేసింది. గుర్రాలమీద వచ్చినవారు ఈ దృశ్యం చూసి నివ్వెరపోయి వెనుదిరిగిపోయారు. సృష్టి అశ్వత్థంగా భగవద్గీతలో వర్ణనం. కర్మానుబంధాలు విస్తరించిన దానివేర్లు, అశ్వత్థం పూజ, ప్రదిక్షణం సంతానాన్ని ప్రసాదిస్తుందని ఆస్తికుల విశ్వాసం. రావిచెట్టు చేసిన ఈ అద్భుతం వల్లనే ఆవలిగట్టున వీరి కర్మానుబంధాలు విస్తరించాయి. ఈ విషయమే ఇక్కడ సూచితమైంది.

'ఒన్ హండ్రెడ్ ఇయర్స్ ఆఫ్ సోలిట్యూడ్'లో ఉర్సులాకి జరుగబోయే ముందు విషయాలు తెలిసినట్లు 'గోపల్లె'లో నాయనమ్మకి కొన్ని విషయాలు తెలుస్తూ ఉంటాయి - ఆమె గోవిందప్ప ఏమి చేయాలో మార్గదర్శనం చేస్తూ ఉంటుంది.

అడవిదారులలో నడుస్తున్నప్పుడు అనేక అద్భుత సంఘటనలు జరుగుతాయి. దోవలో ఒక వ్యక్తి నిలబడి "మీరు ఇట్లా తప్పించుకురావటం నిన్న రేయి కలలో కనబడింది. పొద్దున్నుంచి ఈ దోవలో ఎదురుచూస్తున్నాను" అంటాడు (పుట - 47)

రామాయణంలో సీతాదేవిని భూదేవి చీల్చి తనలో చేర్చుకున్నట్లు, ఇందులో తులసి అనే అమ్మాయిని కూడా భూదేవి తనలో చేర్చుకుంటుంది. దుండగుడి చేతిలో జుట్టు నేలని పడుతుంది. అమ్మవారు స్వయంగా కనబడి - వీరికి ధైర్యం చెబుతుంది. తరువాత గుడిలో మాయమైపోతుంది. ఆ సంఘటనల తరువాత నాయనమ్మకి జగరబోయే సంఘటన మనసులో అవగతమౌతుంది. చెన్నాదేవి - ఈ నవలానాయకి అని చెప్పవచ్చు. ఆమె సౌందర్యం - ఆమె పేరులోనే సూచితమైంది. దొంగల నాయకుడు-ఆమె దివ్య సౌందర్యాన్ని చూసి ఆమెకు మోకరిల్లుతాడు. ఆ సౌందర్యమే తురక వర్తకులను సమ్మోహితులను చేసింది. ఆ సౌందర్యమే పాలకులను చెడు తలంపుకు గురిచేసింది. అయిన వారిని వలసబాట పట్టించిన ఆ సౌందర్యమూర్తి - చెన్నాదేవి మార్గమధ్యంలోనే మరణించటం విషాదం.

"అడవిదారులలో నడుస్తున్నప్పుడు అనేక అద్భుత సంఘటనలు జరుగుతాయి. దోవలో ఒక వ్యక్తి నిలబడి "మీరు ఇట్లా తప్పించుకురావటం నిన్న రేయి కలలో కనబడింది. పొద్దున్నుంచి ఈ దోవలో ఎదురుచూస్తున్నాను" అంటాడు"

విషాదంలో అద్భుత మాయావాద రసం. రంగరించి కీ.రా. గోపల్లె నవలను తీర్చిదిద్దారు. 18వ శతాబ్ది నాటి సామాజిక స్థితిగతులు, నాటి సంస్కృతీ సంప్రదాయాలు ఇందులో అక్షరబద్ధం చేశారు కీ.రా. కన్నీటి చెలమ నుంచి ఆవిర్భవించిన మెరుపుతీగ 'గోపల్లె'. తెలుగువారైన ఈ తమిళ రచయిత 'గోపల్లె' నవల తమిళంలో తొలి మాండలిక నవలగా ప్రసిద్ధికెక్కడం విశేషం.

# రంగుల రాయడు వడ్డాది పాపయ్య



- సుంకర చలపతిరావు
✆ 91546 88223

రామాయణ, భారత, భాగవత పురాణాలలోని ముఖ్య దృశ్యాల్ని... ఇంకా రాగాలు, ఋతువులు, నక్షత్రాలు, పౌర్ణములు, పండుగలు, ప్రముఖుల రూప చిత్రాలు, భావ చిత్రాలు, ఊహా చిత్రాలు, సామాజిక చిత్రాలు చూసి రంగుల లోకంలో విహరించాలనుకుంటున్నారా! అయితే మీరు గతంలోకి ఒకసారి వెళ్ళండి. ఎలాగంటున్నారా! 1960-90 మధ్య పిల్లలకి, పెద్దలకి బంగారు కాలంగా ప్రసిద్ధి చెందింది. ఆ సమయంలో ముద్రించిన చందమామ, యువ పాత పత్రికల ముఖ చిత్రాలు చూడండి. నేను పైన చెప్పినవన్నీ మీరు చూడవచ్చు. ఆ రంగుల దృశ్య కావ్యాల్ని మీకు చూపించేది వపా. అదేనండి వడ్డాదిపాపయ్య. 2021లో ఆయన శతజయంతి సంవత్సరం. ఈ సందర్భంగా ఆయన కళాప్రతిభ గురించి తెలుసుకొందాం.



తెలుగు చిత్ర కళా రంగంలో తిరుగులేని చిత్రకారుడిగా గుర్తింపు పొందిన వ్యక్తి వపా. పవిత్ర నాగావళి తీరాన వున్న శ్రీకాకుళంలో ఒక సామాన్య కుటుంబంలో పుట్టిన వపా, స్వయం కృషితో అనన్య సామాన్య చిత్రకారుడుగా, తెలుగు చిత్రకళా రంగంలో చక్రవర్తిగా ఎదిగారు. 1942-90 సం.ల మధ్యగల అర్ధ శతాబ్దంలో ఆయన వేల సంఖ్యలో వర్ణ, ఏకవర్ణ చిత్రాలు గీసారు. వాల్మీకి, వ్యాసుడు, పోతన తదితరుల అక్షరాల్ని రంగుల్లో మార్చి పండిత, పామరులు, పిల్లలు,

పెద్దలు అవగాహన చేసుకునే విధంగా, ఒక్కొక్క చిత్రం ఒక వర్ణ దృశ్యకావ్యంగా చిత్రించేవారు. ఆయన పౌరాణిక చిత్రాలు సినీ కళాకారులకు, సెట్టింగులకు, మేకప్పులకు వాడుకునేవారు. ఆయన వేసే మినియేచర్ చిత్రాల్లో సువిశాల సామ్రాజ్యం కనిపిస్తుంది.

తెలుగునాట వర్ణచిత్రం అంటే వపాదే అనేలా కళాభిమానుల్ని ఆయన ఆకర్షించారు. సంప్రదాయం ప్రకటిస్తూనే, తన సొంత శైలిని ఆయన బొమ్మల్లో చూపించేవారు. సహజసిద్ధ చీరతో, రతనాల నగలతో నిండుగా వుండే ఆయన పల్లె పడుచు తెలుగు చిత్రకళకు ఒక ప్రతీక. నేటి జీన్స్ ఫ్యాంట్లు, బోసి మెడలు, విరబోసిన కురులు, స్టైలిష్‌తో కూడిన చెవి కమ్మలు, బ్యాక్‌ఫ్రీ రవికలు వపా అర్థశతాబ్దం క్రిందటనే తన చిత్రాల్లో చూపించారు. అందుకే ఆయన చిత్రాలు నాడు, నేడు, రేపు కూడా సజీవాలే.

> ప్రపంచంలో ఇప్పటివరకూ నక్షత్రాలు, పౌర్ణములు, రాగాలు, ఋతువులకు, గ్రహాలకు రూపం కల్పించిన చిత్రశిల్పి వపానే. ప్రభుత్వాలకు, పారిశ్రామిక ఉత్పత్తులకు మాత్రం వుండే లోగో కల్గిన ఏకైక చిత్రకారుడు మన వపా. తెలుగువారందరికీ గర్వకారణమైన విషయం.

ప్రపంచంలో ఇప్పటివరకూ నక్షత్రాలు, పౌర్ణములు, రాగాలు, ఋతువులకు, గ్రహాలకు రూపం కల్పించిన చిత్రశిల్పి వపానే. ప్రభుత్వాలకు, పారిశ్రామిక ఉత్పత్తులకు మాత్రం వుండే లోగో కల్గిన ఏకైక చిత్రకారుడు మన వపా. తెలుగువారందరికీ గర్వకారణమైన విషయం. ఫ్రెంచి చిత్రకారులు ఇంద్రస్, భారతీయ చిత్రకారులు రాజా రవివర్మ తదితరులు స్ఫూర్తితో వపా చిత్రాలు గీచారు. 1942లో ఆంధ్రజ్యోతిలో ప్రచురితమైన 'రతీ మన్మథులు' ఆయన తొలి చిత్రం. మహాకవి శ్రీశ్రీ ఈ చిత్రం చూసి 'చిలకముక్కులా' గుచ్చుకొందని ప్రశంసించారు.

1948 మే నెల 'చందమామ'లో కూరగాయల అపూర్వ నృత్య, వాయిద్య సమ్మేళనం పేరిట రేఖాచిత్రం గీచారు. ఇందులో ఆడేది, మద్దెల వాయించేది,

వీణ మీటేది అన్నీ కూరగాయలే. ఎదో ఒక ప్రత్యేకత లేకుండా ఆయన చిత్ర రచన చేసేవారు కాదు. చందమామలో ఆయన (1960-92) మూడు దశాబ్దాల పాటు క్రమం తప్పకుండా ఐదువందలు పైగా ముఖ చిత్రాలు గీచారు. ఆయన జీవించి ఉన్నంతకాలం మరొకరు ఆ పత్రిక ముఖచిత్రం గీయలేదు.

వపా రామాయణం, భారతం, భాగవతం, హనుమాన్, శివపురాణం, అరణ్య పురాణం తదితర కథలకు తనదైన శైలిలో వర్ణ చిత్రాలు సహజ సుందరంగా చిత్రించారు. చిత్రకారులు బొమ్మలు వేస్తారు కానీ వపా బొమ్మలకు ప్రాణం పోస్తారు.

తెలుగు చిత్రకారులకు లేని ప్రత్యేకతలెన్నో వపాకు వృత్తిపరంగానూ, వ్యక్తిగతంగానూ వున్నాయి. ఆయన పౌరాణిక చిత్రాలతో పాటు, దేశంలో ఎవ్వరూ సృజించడానికి సాహసించలేని ఎన్నో విషయాల్ని, ఆయన మనకు చిత్రాలుగా అందించారు. తనకెంతో ఇష్టమైన 'శ్రీరామ పట్టాభిషేకం' అనేకసార్లు, అనేక కోణాల్లో విభిన్న రీతులలో గీసారు. అదేవిధంగా దుర్గాదేవి, శివుడు, పార్వతి, హనుమంతుడు, వినాయకుల్ని అనేక ప్రత్యేకతలతో సృష్టించారు. పాములే ఆభరణాలుగా శివుడ్ని, అష్ట పలకలతో మహాబలి ఆంజనేయుడ్ని, రెండు అంతస్థులుగా పంచముఖ వినాయకుడ్ని అర్థశతాబ్దం క్రితమే వపా ఆవిష్కరించడం విశేషం.

భారతదేశానికి స్వాతంత్రం తెచ్చిన మహాత్మాగాంధీ, ఆంధ్రప్రదేశ్ అవతరణకు ఆమరణదీక్ష చేసిన పొట్టి శ్రీరాములు, స్వాతంత్ర్య సమరయోధులు అల్లూరి, ఝాన్సీ లక్ష్మీభాయి, రాణి రుద్రమదేవి, ఆధాత్మికవేత్త శంకరాచార్య, అమర గాయకుడు ఘంటసాల, అమర చిత్రకారుడు దామెర్ల, ప్రజాకవి వేమన, మహాకవి గురజాడ, సంగీత నిధి త్యాగయ్య... ఇంకా గౌతమ బుద్ధుడు, మొల్ల, నాగనిక, శ్రీముఖుడు, శ్రీ కృష్ణదేవరాయలు, కవిత్రయం నన్నయ, తిక్కన, ఎఱ్ఱన మరియు మహాకవి పోతనలకు ప్రాణ ప్రతిష్ఠ చేశారు.

మన రాష్ట్రంలో ప్రవహిస్తున్న ముఖ్య నదులు వంశధార, నాగావళి, శారద, గోదావరి, కృష్ణ నదులకు రూపం కల్పించారు. ఇంద్రలోకానికి చెందిన రంభ, ఊర్వశి, మేనక, తిలోత్తమలను భూలోకానికి రప్పించి మనకు పరిచయం చేశారు. నవగ్రహాల్లో చతుష్టయంగా పేరొందిన 'రాహువు, కేతువు, అంగారకుడు, శని'లకు ఆకృతి కల్పించారు. దక్షప్రజాపతి కుమార్తెలు, చంద్రుని భార్యలైన 27 నక్షత్రాలకు ఆకారాలు కల్పించింది వపానే.

ఇంకా ఆయన పున్నములపై కూడా చిత్రాలు గీచారు. బుద్ధ పూర్ణిమ, డోలా

పూర్ణిమ కాముని పూర్ణిమ, గౌరీ పున్నమి, గోకుల పూర్ణిమ, మహాత్మా పూర్ణిమ రామచంద్ర పూర్ణిమలు వపా ప్రతిభను, వూహాశక్తిని తెలియజేస్తాయి. ఇవి కాకుండా మన తెలుగువారు జరుపుకునే చిన్నా, పెద్ద పండుగలన్నీ అనేకసార్లు సంస్కృతి ఉట్టిపడే విధంగా చూపించారు. తెలుగు సంవత్సరాలకు కూడా వపా బొమ్మలు వేశారు. కాని అవి అలభ్యం. నేను గీచిన ఏ చిత్రం పరిశోధించింది కాదు. మనస్సులో నాటుకొన్నవి మొలకెత్తక మానవు అంటుండేవారు ఆయన.

బెంగాలీ రచనలు తెలుగులో వస్తున్న రోజుల్లో చిత్రకారునిగా వపా చేసిన కృషి  చెప్పుకోతగినది. శరత్ నవలకు ఆయన వేసిన బొమ్మలు పాఠకుల్ని విశేషంగా ఆకర్షించేవి. బెంగాలీ నుండి తెలుగులోకి వచ్చిన దేవదాసు, సాలా గ్రామరహస్యం, నరరూప రాక్షసులు, భారతి తదితర నవలలకు ఆయన బొమ్మలు వేశారు. ఇంకా నండూరి ఎంకి పాటలు, దేవులపల్లి పద్యాలకు, ఉమర్ ఖయ్యూం లకు అనేక చిత్రాలు గీచారు.

కథా రచయితల కథ తాలూకా దేశకాల పరిస్థితులు బాగా తెలిసి వుండాలి. కనీసం ఊహించే శక్తి అయినా వుండాలి. రస హృదయం దాన్నే కవి హృదయం వుండాలి. నేను వేసిన వాటిల్లో కొంతవరకు అయినా ఇవన్నీ వుంటాయి అనేది వపా అభిప్రాయం.

వపా ఎక్కువగా స్త్రీలకు సంబంధించిన చిత్రాలే గీచారు. మహిళలు అందానికి ప్రతీక కదా! ఆయన ఒక పత్రికలో వేసిన చిత్రాలన్నీ, శృంగార చిత్రాలే. అసభ్యతకు తావులేకుండా ఆమలిన శృంగారం తన చిత్రాల్లో చూపించారు. క్యూపిడిజం అంటే మన్మధిజం. అనగా మన్మధ కళ అంటే ఆయనకు ఎంతో ఇష్టం. పత్రికలకు కొన్ని చిత్రాలు గీచినా, సొంతానికి మరికొన్ని గీచుకొన్నారు. అలాంటి పది చిత్రాలు చూసే అవకాశం కాశింపోటలోని ఆయన స్వగృహంలో నాకు కల్గింది. బ్రౌన్ పేపరుపై తెలుపు-నలుపు రంగుల్లో వాటిని చిత్రించారు. అవి ప్రచురణకు కాదని నాకు చెప్పారు.

వపా దాదాపు 70 సంవత్సరాల క్రిందట గీచిన రేఖా చిత్రం 'వటపత్ర శాయికి లాలి'లో నీటమునిగిన ఒక మహిళ తన రెండు చేతులతో ఒక బాలుడ్ని పైకి ఎత్తి పట్టుకొన్నట్టు చిత్రించారు. ఈ చిత్రాన్ని పరిశీలనగా చూస్తే ఇటీవల ప్రపంచవ్యాప్తంగా సంచలనం సృష్టించిన తెలుగు సినిమా 'బాహుబలి' మొదటిభాగం కోసం వచ్చిన గోడపత్రిక వపా చిత్రాన్ని పోలి ఉంటుంది. అదేవిధంగా 1998లో అమెరికన్ హాస్య చిత్రం 'సైమన్ బర్డ్' పోస్టర్ కూడా అచ్చంగా వపా చిత్రం గుర్తుకు వస్తుంది. ఆయా సినీ దర్శకులకు యాదృచ్ఛికంగా వచ్చిన ఆలోచనా లేక వపా స్ఫూర్తితో అలాంటివి

రూపొందించారో? వపా దూరదృష్టిని, కళాసృష్టిని ప్రశంసించకుండా వుండలేము.

1940 వ దశకంలో పిల్లల్ని ఆకట్టుకోవడానికి ఆయన 'బాల' పత్రికలో తమాషా అయిన బొమ్మలు ఎన్నో వేశారు. బొమ్మను మామూలుగా చూస్తే ఒక రూపం, తిరగవేసి చూస్తే మరొకరూపం కనిపించేవి. రామాయణం తమాషా, దశరథుడు, కైకేయ, రాము సంతోషం, సోము ఏడుపు, కృష్ణుడు - సత్యభామ, గ్రీకుయోధుడు వీటిలో ముఖ్యమైనవి. అప్పట్లో ఈ బొమ్మలు ఎంతో సంచలనం కల్గించాయి.

చిత్రకారుడైన వపా తొలి తెలుగు కార్టూనిస్ట్ తలిశెట్టి రామారావు నాయుడు స్ఫూర్తితో నవ్వులు పువ్వులు, వాణి, ఆనందవాణి, యువ, ఆంధ్రజ్యోతి తదితర పత్రికల్లో వందల కార్టూన్లు వేశారు. అది తనదైన శైలిలో. చిత్రాలకు శీర్షికల మాదిరిగా కార్టూన్లకు కూడా ఆయన శీర్షికలు పెట్టేవారు. పోలికలు, బొమ్మలకే ప్రాణం వస్తే, దేవుళ్ళపాట్లు, శీర్షికల క్రింద ఎన్నో కార్టూనులు వేశారు. స్తబ్ధంగా వున్న తెలుగు వ్యంగ్య చిత్రకళకు విసురు తెచ్చింది వపానే. హాస్యం ద్వారా సంఘాన్ని బాగా ఎకసెక్కం చేసి అందులోని లోటుపాట్లను, అవకతవకల్ని చూపించినప్పుడే హాస్యం ప్రయోజనకారి అవుతుందనే వారు ఆయన.

> చిత్రకారుడైన వపా తొలి తెలుగు కార్టూనిస్ట్ తలిశెట్టి రామారావు నాయుడు స్ఫూర్తితో నవ్వులు పువ్వులు, వాణి, ఆనందవాణి, యువ, ఆంధ్రజ్యోతి తదితర పత్రికల్లో వందల కార్టూన్లు వేశారు. అది తనదైన శైలిలో. చిత్రాలకు శీర్షికల మాదిరిగా కార్టూన్లకు కూడా ఆయన శీర్షికలు పెట్టేవారు.

వపా కార్టూన్లు, రేఖా చిత్రాలు, వర్ణ చిత్రాలతో పాటు అనేక బొమ్మల కథలు వేశారు. శకుంతల కథ, కమల తిలకం, ప్రమద్వార కథ, నూరువరాలిచ్చిన నూకాలమ్మ... తదితరాలు విశేష ఆదరణ పొందాయి. ఆయన అప్పుడప్పుడు యువ, చందమామ, కథామంజూష తదితర పత్రికల్లో ఎన్నో కథలు వ్రాశారన్నది కొద్దిమందికే తెలుసు. చందమామలో కొడవటిగంటి కుటుంబరావు ప్రారంభించిన 'దేవి భాగవతం' పూర్తిచేసింది వపానే. విష్ణు కథ రాసింది కూడా ఆయనే. ఇంకా

'కుబ్జ, నాగ, దిగంత రేఖ, ఎఱ్ఱి కుక్క, శంకురాయి, జంబూలోక చరిత్ర, జావళి, ఆషాడమనీయం' వంటి కథల్ని రాశారు. వీటిని గురించి ఎవ్వరూ చెప్పరు అనుకొన్నప్పుడు, వాటికి కథలుగా కల్పన చేసి, బయట పెట్టాలని మాత్రమే వ్రాయడం జరిగింది. రచన అని కాదు. రచయితను కాను అంటుండేవారు.

సిక్కోలుగా ప్రసిద్ధి చెందిన శ్రీకాకుళంలో వపా 1921 సెప్టెంబర్ 10న మహాలక్ష్మి - రామమూర్తి దంపతులకు జన్మించారు. తండ్రి స్థానిక పాఠశాలలో డ్రిల్ / డ్రాయింగ్ టీచరుగా పనిచేసేవారు. 5వ సంవత్సరంలో హనుమంతుని చిత్రం గీచారు. 1938లో పాఠశాల విద్యను పూర్తిచేశారు. తర్వాత వివిధ పత్రికల్లో కార్టూన్లు, కథలు, చిత్రాలు గీస్తుండేవారు. వీరి ప్రతిభ గుర్తించిన ప్రముఖ రచయిత ధనికొండ హనుమంతరావు వపాని చక్రపాణికి పరిచయం చేశారు. విజయా సంస్థకు చెందిన చందమామ, యువ పత్రికల్లో చిత్రకారుడుగా మూడు దశాబ్దాలు పనిచేశారు. 1970 దశకం చివర్లో ఆరోగ్యపరమైన సమస్యలతో అనకాపల్లి సమీప గ్రామం కాశింకోట వచ్చి శారదా నదీతీరంలో గ్రామం శివారున వేణుగోపాల స్వామి ఆలయం ఎదురుగా చిన్నమేడకట్టుకొన్నారు. ఇంటి నుండే చిత్రాలు గీసి పోస్టు ద్వారా పత్రికా కార్యాలయాలకు పంపేవారు.

> యువలో ముద్రించిన చిత్రాలు అనంతరం త్రిప్పి పంపేవారు. చందమామ చిత్రాలు మాత్రం యాజమాన్యం భద్రపర్చేది. యువ మాసపత్రికకు ప్రతినెలా మూడు లేదా నాలుగు వర్ణ చిత్రాలు వేసేవారు.

యువలో ముద్రించిన చిత్రాలు అనంతరం త్రిప్పి పంపేవారు. చందమామ చిత్రాలు మాత్రం యాజమాన్యం భద్రపర్చేది. యువ మాసపత్రికకు ప్రతినెలా మూడు లేదా నాలుగు వర్ణ చిత్రాలు వేసేవారు. భావ చిత్రాలు, ఊహా చిత్రాలు, పండుగలు, సంస్కృతి, నక్షత్రాలు, పౌర్ణములు, సామాజిక అంశాలకు సంబంధించిన విషయాలకు సంబంధించి బొమ్మలు వుండేవి. దీపావళి ప్రత్యేక సంచికకు సంబంధించి, మహనీయుల అపురూప చిత్రాలు, భావ చిత్రాలకు ఎంతో ప్రాధాన్యత ఇచ్చేవారు.

చందమామ విషయానికి వస్తే, పత్రికలో ప్రచురితమౌతున్న పురాణాలు,

ఇతిహాసాలకు సంబంధించినవి, అట్టమీద, అట్టవెనుక ప్రత్యేక శ్రద్ధతో తీర్చిదిద్దేవారు. ఒక దశాబ్దం క్రిందట చందమామ చిత్రకారుడు పేరుతో వపా చిత్రాల్ని యాజమాన్యం గ్రంథరూపంలో తెచ్చింది.

1960 సంవత్సరంలో ఖర్గపూర్‌కు చెందిన ఆంధ్రవిజ్ఞాన సమితి 'సంక్రాంతి' పర్వదినం పురస్కరించుకొని వపా చిత్రకళా ప్రదర్శన తొలిసారి నిర్వహించింది. ఈ సందర్భంగా అప్పటికప్పుడు ఇరవై వర్ణ చిత్రాలు సృష్టి ప్రదర్శించారు. నూట పదహారు రూపాయలతో నిర్వాహకులు వపాను సత్కరించారు. తర్వాత మరెక్కడా ఆయన చిత్రకళా ప్రదర్శన జరుగలేదు.

ప్రహ్లాదుడికి దేవుడు ఎలాగో, కళాకారుడికి కళ అలాగ, పుట్టుకతో కళ అంటే అభిమానం వున్నవాడికి అది వదలదు. నిజమైన కళాకారుడెప్పుడూ విమర్శ పాటించడు. తనకు తోచినటువంటి ఉత్తమ కృషిని చేస్తూనే వుంటాడు. సామాన్యుడు చెప్పిన విషయం గ్రహించకల్గిన వాడే ఉత్తమ చిత్రకారుడనేది వపా నిశ్చిత అభిప్రాయం.

తన మరణం ఒక సంవత్సరం ముందుగానే ఊహించి, తన 'చరమ చిత్రం' తనే వేసుకొన్న జ్ఞాని వపా. జీవించి ఉండగానే ప్రచురణలో ఆ చిత్రం చూసుకోవాలన్న పిచ్చి కోరిక అని ఆయన చెప్పుకొన్నారు. ఆయన మరణానికి రెండు నెలలు ముందు అనకాపల్లికి చెందిన వైద్య విజ్ఞాన రచయిత డా. బి.జి.వి. నరసింహారావు రచించిన 'మన్మథ పురాణం'కు ముఖచిత్రం గీచారు. ఇదే ఆయన చివరి చిత్రం అయి వుంటుందని నేను భావిస్తున్నాను. అంతకు మునుపు కూడా బి.జి.వి. రచించిన 'మీరే డాక్టర్' గ్రంథానికి కూడా ముఖచిత్రం గీచి ఇచ్చారు.

వపాతో నా సన్నిహిత్యం పురస్కరించిన వివిధ పత్రికల్లో అనేఖ వ్యాసాలు రాశాను. 1994లో రంగులరాజు, వడ్డాది పాపయ్య, 2007లో వపా లేఖలు, 2012లో సి.పి. బ్రౌన్ అకాడమీ కోరికపై జాతిరత్నాలు శీర్షికలో వడ్డాది పాపయ్య గ్రంథాలు రచించడం జరిగింది.

తెలుగు చిత్ర కళారంగంలో వపా వంటి వైవిధ్యం కల్గిన చిత్రకారుడు లేరు, రారంటే అతిశయోక్తి కాదు. ఆయన ఒక చిత్రకళా యోగి, చిత్రకళా చక్రవర్తి. ఒక అమర చిత్రకారుడు. ఒక బొమ్మల బ్రహ్మ. ఒక చిరంజీవి.

# శాస్త్రవిజ్ఞానం నాశనానికా? నిర్మాణానికా?

- సెట్టి ఈశ్వరరావు
ప్రొఫెసర్ హెచ్. లెవీ వ్యాసాన్ని అనుసరించి

నువ్వున్న గదిచుట్టూ చూడు. చూసి, నీ చూపుకందిన వస్తువుల జాబితా వ్రాయి. ఆ వస్తువుల నిర్మాణంలో, మనిషి స్పర్శ తగలకుండా వున్నప్పటి పూర్వ స్థితిని మాత్రమే నువ్వు వ్రాయాలి. అయితే యిప్పుడేం తేలింది? మంచాలూ, కుర్చీలూ వీట్లలో చెట్లు కోస్తే వచ్చిన కర్ర వుంది. పరుపుల్లో పత్తి వుంది. మేకుల్లో ఇనుముంది. ఇంకా పుస్తకాలూ, ఎలక్ట్రిక్ దీపాలూ, బట్టలు, బొమ్మలు - యివ్వన్నీ ప్రకృతిలో వున్న రూపంలో లేనేలేవు. అంటే వీట్లో 'ముడి వస్తువు' అనబడేది కనుక్కోవడమే కష్టం. దీనిని బట్టి, నేటి నాగరిక జీవితం తన అవసరాల కోసం ప్రకృతిని ఎలా సాధించిందో నీకర్థమవుతుంది.

ఇదుగో యిటు చూడు. ఇక్కడ రెండు రకాల కాగితం వుంది. ఒకటి ముదుగురకం: కాని గట్టిది. దీన్ని చింపడం కష్టం. ఇది సరిసమానంగా వుండదు. వెల్తురుకు ఎదురుగా పెడ్తే, యీ ముదుగు కాగితంలో కనిపించినట్టు మచ్చలేవీ కనిపించవు. ముదుగు కాగితంలాగ కాకుండా, బల్లమీద పెడ్తే యిది సరిసమానంగా వుంటుంది. ఈ కాగితం రాతకు బాగుంటుంది. మొదటిది వస్తువులు పేకింగు చెయ్యడానికి పనికొస్తుంది గాని, రాతకు పనికిరాదు. వేరువేరు ప్రయోజనాలకు పనికొచ్చేటట్టు యీ రెండురకాల కాగితం తయారు చెయ్యడానికి ఎంత శ్రమ, ఎంత నైపుణ్యం, ఎంత పరిశోధన ఖర్చు చెయ్యాల్సి వచ్చిందో ఆలోచించు.

## ఒక్క తరంలో

ఆ ఫౌంటెన్ పెన్నూ, ఆ రిస్టు వాచీ నిర్మించడానికి ఎంత సూక్ష్మమైన శాస్త్రవిజ్ఞానం (సైన్సు) వినియోగించాలో ఆలోచించు. ఇవ్వన్నీ మన జీవితంలో అవసరమయ్యే సామాన్యవస్తువదీ. మన ఇళ్ళల్లోకి, పనిలోకి, విలాసాలలోకి శాస్త్రం

ఎంత లోతుగా చొచ్చుకపోయిందంటే - వీట్లలో శాస్త్రం వున్నదన్న చైతన్యమే మనకుండదు! ఇది పాతుకపోయిన సాంప్రదాయ మేమీ కాదు. ఇప్పుడు మామూలు వాడుకలో వున్న విద్యుచ్ఛక్తి నిర్మించిన వస్తువుల్లో అత్యధికభాగం ముప్ఫై నలభై సంవత్సరాలకు పూర్వం లేనేలేవు.

> శాస్త్రం కల్పించిన యీ సదుపాయాలన్నీ మాయమైపోతేనో? మన నాగరిక జీవితమంతా చప్పగా కూలి పూరుకుంటుంది. మోటారు కార్లూ, ట్రాం బళ్ళూ, టెలిఫోన్లూ మొదలైనవన్నీ లేకపోతే, లక్షల సంఖ్యలో జనాభా గల మద్రాసువంటి మన నగరాల్లో జీవితం దుర్భరమైపోతుంది.

శాస్త్రం కల్పించిన యీ సదుపాయాలన్నీ మాయమైపోతేనో? మన నాగరిక జీవితమంతా చప్పగా కూలి పూరుకుంటుంది. మోటారు కార్లూ, ట్రాం బళ్ళూ, టెలిఫోన్లూ మొదలైనవన్నీ లేకపోతే, లక్షల సంఖ్యలో జనాభా గల మద్రాసువంటి మన నగరాల్లో జీవితం దుర్భరమైపోతుంది. ఇవన్నీ ఆగిపోకుండా సాగిపోతాయనీ, కొత్తగా మన అవసరాలను తీర్చుకోవడానికీ, రానున్న ప్రమాదాలను దాటడానికీ శాస్త్రం పనికి వస్తుందన్న నమ్మకంతోనూ, వీటన్నిటినీ మనం సమిష్టిగా నిర్మించుకున్నాం. రేపు తెల్లారేటప్పటికి శాస్త్రం మనకు ప్రసాదించిన వస్తువులన్నీ అమాంతం మాయమైపోతాయనుకో. అప్పుడేం చేస్తావు? ఊసుపోని ఉద్యోగంగా నే నీ ఊహ చెప్పడం లేదు. మన భవిష్యత్తునూ, మన నాగరిక జీవితాన్ని శాస్త్ర విజ్ఞానం మీదనే ఆధారం చేసుకున్నామన్న విషయం నిన్ను గుర్తించమనడానికే నీకీ విషయం సూచించాను.

ఈ విషయంలోని తికమకలు యింకా వివరంగా చూద్దాం. ఒక నూటాయాభై సంవత్సరాల క్రితం ఇంగ్లండులో జనాభా చాలా తక్కువగా వుండేది. వ్యవసాయ వృత్తి అధికంగా వుండేది. తరవాత శాస్త్రం కొత్త శక్తిని ప్రసాదించింది. రాక్షసి బొగ్గూ, స్టీమూ (ఆవిరి) వచ్చాయి. దాంతో దేశమే మారిపోయింది. పంటపొలాలు – బీడుభూములు గానూ, బొగ్గు గనులు గానూ, ఇనప

ఫాక్టరీలు గానూ మారిపోయాయి. నిశ్శబ్దంగా వుండే గ్రామాలు అకస్మాత్తుగా పట్టణాలయిపోయాయి. పల్లెటూరి జనం నానాటికీ పెరిగిపోతున్న పట్టణాల్లోనికి ప్రవహించారు. ఒక్కతరంలో బ్రిటను పూర్తిగా యంత్రయుగంలో ప్రవేశించింది. ఈ క్రింది మూడు వాస్తవిక విషయాలూ ముఖ్యమైనవి. 1. ఎక్కువభాగం ప్రజల జీవిత విధానం ఒక్కతరంలో పూర్తిగా మారిపోయింది. 2. సాంఘిక వ్యవస్థలో ఎక్కువభాగం పూర్వం వ్యవసాయం ద్వారా నిర్ణయింపబడినట్టే, యిప్పుడు స్టీము, బొగ్గు, ఇనుము వల్ల ఉపయోగాలు బ్రిటన్‌లోని సాంఘిక వ్యవస్థను ముఖ్యంగా నిర్ణయిస్తున్నవి. 3. పట్టణాల్లో నిర్మింపబడిన ప్రజల జీవితం, యీ సదుపాయాలన్నీ స్థిరంగా వుంటాయన్న గట్టినమ్మకంతో చేసినవి.

## మెదడు చేసే పనులకు యంత్రాలు

ఈ ఆఖరు అంశం యెలా గురితప్పిందో మనం కళ్ళారా చూస్తున్నాం. ప్రజల అవసరాలు మారుతుంటాయేకాని, ఒకేలాగ వుండిపోవు. మారుతున్న యీ అవసరాల ప్రోద్బలంతో, శాస్త్రపరిశోధన అభివృద్ధి చెందుతూ వుంటుంది. ఇంకొకటేమంటే, శాస్త్రాభివృద్ధి ఒక్క సరిహద్దుల్లో వుండిపోదు; సరిహద్దులు దాటి ప్రపంచం అంతా వ్యాపిస్తుంది. ఈ యంత్రవ్యాప్తి త్వర త్వరగా జరుగుతుందిగాని ఒకచోట ఎక్కువ గాను, ఇంకోచోట తక్కువగాను జరుగుతుంది. ప్రపంచ అవసరాలు తీర్చడానికి యే మోతాదులో యంత్ర నిర్మాణం జరగాలని కాని, యేయే దేశాల్లో యేయే విధంగా జరగాలన్నది గాని మనం ఆలోచించడం లేదు. అంతర్జాతీయంగా ఏ చర్య తీసుకోకపోవడం వల్ల దేశాల మధ్య వర్తకపు పోటీ శృతిమించింది.

## అవసరాలనుబట్టి మార్పులు

ఆవిరి (స్టీమ్) యంత్రాలు కనిపెట్టడంతో ఒక కొత్తశకం ప్రారంభమైంది. దీనివల్ల వరసగా యెన్నో మార్పులు వచ్చాయి. వీటికి ముఖ్యాధారం ప్రజల అవసరాలు. శాస్త్ర జ్ఞానం అవసరాలకు అనుగుణంగా వస్తువులు సృష్టిస్తూ ఉంటే, సంఘంలో విశేషమైన మార్పులు వచ్చాయి. ఒక్కతరంలో ఎన్ని కొత్తపరిశ్రమలు పుట్టాయో, యెన్ని చచ్చాయో జాబితా వేస్తే, వచ్చిన మార్పు లెటువంటివో నీకు బాగా అర్థమవుతుంది. యాభై ఏళ్ల క్రితం మన వృత్తులకీ, ఇప్పటి మన వృత్తులకీ మధ్య తేడా గమనించు. రవాణావంటి పరిశ్రమలో గుర్రంబండి, రైలు, మోటారు, ఏరోప్లేను ఒకదాని తరవాత ఒకటి యెలా వచ్చాయో ఆలోచించు.



మెదడు చేసే పనులు కూడా యంత్రాలే చేస్తున్నాయి. ఇన్సూరెన్సు కంపెనీల్లోనూ, బేంకుల్లోనూ యంత్రాలే లెక్కలు చేస్తుంటాయి. లేబొరేటరీలలో ఎలక్ట్రిక్ మెషిన్లతో అతిసున్నితమైన పనులెన్నో చేయిస్తుంటారు. అతి చిక్కుసమస్యలు ఎన్నింటినో ఇవి విడదీస్తుంటాయి. పరిశోధనల్లో వచ్చే తప్పుల్ని కూడా యివి చూపుతుంటాయి. ఈ యంత్రాలు మనిషి చెయ్యవలసిన పనిని అవి చెయ్యడమే కాకుండా, ఆ పనిలో వెంట్రుకవాసి తప్పు కూడా రాకుండా చక్కగా చేస్తున్నాయి. కొత్తయంత్రాలు పరిశ్రమలను యెలా అభివృద్ధి చేస్తున్నాయో చూద్దాం.

## అంతులేని ఉపయోగాలు

రాక్షసి బొగ్గును ఒక ప్రత్యేక పద్ధతిలో వేడిచేస్తే దానినుండి కోల్‌గాస్, కోల్‌తారు, అమోనికల్ లిక్కరూ వస్తాయి. 1489 సంవత్సరంలో కోల్‌గాస్ ను తయారుచెయ్యడం ప్రారంభమైంది. పదిహేనేళ్ళ తరవాత గాస్ ఫాక్టరీ నిర్మింపబడింది. దీనివల్ల గాస్ లైట్లు వచ్చి మనకెంతో ఉపయోగపడ్డాయి. కాని యీ గాస్ తయారుచెయ్యడంలో కొన్ని దుష్ఫలితాలు కూడా వున్నాయి. ఈ గాస్‌దీపాలు ఎంత అవసరమో దాని దుర్గంధం నుండి వచ్చే ఫలితాల్ని పోగొట్టుకోవడమూ అంత అవసరమే. గాస్ నుండి కొన్ని పదార్థాలు దుర్వ్యయం కావడం వల్ల యీ పరిస్థితి వచ్చింది. దీని అంతేమిటో కనుక్కోవడానికి శాస్త్రజ్ఞుడు (సైంటిస్టు) పూనుకున్నాడు. లాభాలు మింగే వర్తకుడికీ ఆలోచనే లేదు. బెథాల్ అనే శాస్త్రజ్ఞుడు, వృథా అవుతూన్న కోల్‌తారు నుండి వచ్చే ఒక నూనె కర్రను పాడుకాకుండా కాపాడుతుందని కనుక్కొన్నాడు. అంతకుపూర్వం రైల్వేలైన్లకు మధ్య వేసే కర్రె (స్లీపర్స్) పాడుకాకుండా వుంచడం ఎలాగ అన్నది పెద్ద సమస్యగా వుండేది. ఈ పరిశోధనతో ఆ సమస్య తీరిపోయింది. 1824వ సంవత్సరంలో ఫారడే

లేబరేటరీలో బెంజైన్ తయారుచేశాడు. ఇరవై ఏళ్ళ తరువాత, కోల్‌తారు నుండి బెంజైన్ తయారుచెయ్యొచ్చునని కనిపెట్టబడింది. ఇంతకుపూర్వం వర్తకులు యీ కోల్‌తారును పారవేసేవారు. పైగా దీన్ని పారవెయ్యడానికి బాగా డబ్బు ఖర్చు చేసేవారు! కాని నాలుగు రాళ్ళు ఖర్చుచేసి పరిశోధన చేయించడమనేది యీ వర్తకులకు తోచేది కాదు. పద్దెనిమిది సంవత్సరాల వయస్సుగల పెర్విన్ అన్న పరిశోధకుడు 1849లో కోల్‌తారులో వున్న బెంజైన్ నుండి ఎనిలైన్ అన్న రంగు కనుక్కున్నాడు. ఇది రంగుల పరిశ్రమను ఎంతో అభివృద్ధి చేసింది.

బొగ్గు పరిశ్రమలో వృథా అవుతున్న వాటిని పరిశోధించడం వల్ల అంతులేని వస్తువులు బయట పడ్డాయి. అనేక రకాల రంగులు, నెప్తలైన్, అమోనియా, క్రిమోసోట్, బెన్‌జోల్, పిచ్, తార్, పెర్ఫ్యూమ్సు, పేరాఫైన్స్ డ్రగ్స్, ఫ్లావరింగ్స్, డిస్ ఇన్‌ఫెక్టెంట్స్... యింతే కాకుండా అనేక పేలుడు వస్తువులు కూడా కనుక్కున్నారు. ఎందుకూ పనికిరాదని పారవేసే వస్తువులను పరిశోధించి paints, ఇండియా రబ్బరు, వార్నిషులు, కంపోజిట్ వ్యూయల్, వుడ్ ప్రిజర్వేషన్, పిట్టుమాన్యుఫాక్చర్ మొదలైనవి ఎన్నింటినో శాస్త్రజ్ఞులు కనిపెట్టారు.

## క్రమపద్ధతి లేనందువల్ల దుర్వినియోగం

దీని నీతి స్పష్టం. పరిశ్రమల అభివృద్ధికి శాస్త్ర సిద్ధాంతాలను ఉపయోగించడానికి సరైన ప్రయత్నం జరక్కపోతే, యిప్పుడు గాని, ముందుకు గాని మన అవసరాలు సమృద్ధిగా గాని, తెలివైన పద్ధతిలో గాని నెరవేరవు. శాస్త్ర సిద్ధాంతం స్ఫురించినప్పట్నుంచి, ఒక వస్తువు ఉత్పత్తి అమ్మకాల వరకూ ఒక సమన్వయ మన్నది తప్పకుండా వుండాలి.

పరిశ్రమలు ఒక క్రమపద్ధతిలో నడవాలంటే, ప్రజల యిప్పటి అవసరాలనూ, ముందు అవసరాలనూ దృష్టిలో పెట్టుకోవాలి. దేశంలోని ప్రకృతి సంపదను వినియోగించుకోవాలి.

శాస్త్ర విజ్ఞానాన్ని పరిశ్రమలలో ఉపయోగించడానికి మూడు మెట్లున్నాయి. మొదటిది శాస్త్ర పరిశోధన. పదార్థ విజ్ఞాన శాస్త్రజ్ఞులు, జీవ శాస్త్రజ్ఞులు మొదలైనవారు, ముఖ్యంగా సిద్ధాంతానికి సంబంధించినంత వరకూ లేబొరేటరీల్లో పరిశోధనలు చేస్తుంటారు. ఈ పరిశోధనలు ముఖ్యంగా విశ్వవిద్యాలయాల్లోనూ, ప్రభుత్వం చేత నడపబడే శాస్త్ర సంస్థలోనూ, గ్రంథాలయాల్లోనూ చేస్తుంటారు. వాటి ఫలితాలు శాస్త్ర పత్రికల్లో ప్రచురింపబడి (దీని ప్రచురణకయ్యే ఖర్చులు తరుచుగా పరిశోధకుడే భరించాలి) ప్రపంచానికి ఉచితంగా అందుబాటులో



కొస్తాయి. పరిశోధనకు ఉపయోగపడే పరికరాల కోసమూ, ప్రచురణ కోసమూ, యీ శాస్త్రజ్ఞుడు నానా తంటాలు పడాలి. గ్రాంటుల కోసం ప్రాధేయపడాలి. సామాజిక జీవితాభివృద్ధికి శాస్త్ర పరిశోధన చాలా అవసరమని నిర్ధారణ అయినప్పటికీ, దూబరా ఖర్చు అయినట్టు గొణిగి గొణిగి, ప్రభుత్వం దయాధర్మంగా యేదో యిచ్చేది.

తరవాత మెట్టు - ఫాక్టరీ లేబొరేటరీలలో పరిశోధించిన విషయాన్ని పరిశ్రమలో ప్రవేశపెట్టడం. రసాయనిక శాస్త్రజ్ఞుడు కోల్‌తారు నుండి ఒక కొత్త రంగు విడదీశాడనుకో. అది బాగా మన్నుతుందా? మోటాగా వుండే ఆ రంగు వర్తకానికి పనికిరావాలంటే యేమేమి చెయ్యాలి? ఒక కొలత కోల్‌తారు నుండి పనికివచ్చే రంగు యేమాత్రం తియ్యొచ్చు? దాన్ని తియ్యడానికి ఎంత ఖర్చవుతుంది? అమ్మకం యెలా జరుగుతుంది? ఈ రంగు తయారీకి యింతకంటే సులువైన పద్ధతులేమైనా ఉన్నాయా? ఈ తయారీలో పనికివచ్చే కొత్త వస్తువు లేమన్నా వస్తాయా? ఉంటే వాటినేమి చెయ్యాలి? ఇటువంటి... యక్ష ప్రశ్నలెన్నో ఉన్నాయి. వీటన్నింటినీ జాగ్రత్తగా పరిశీలించి, పరిశ్రమకు అన్వయించాలి.

## పారిశ్రామిక పరిశోధన అవసరం

ఇటువంటి సమస్యలను పరిశీలించడానికే ఇండస్ట్రియల్ లేబొరేటరీలు అవసరం. ఇందుకు కావలసిన వసతులు కలిగించని పారిశ్రామిక విధానం సాఫీగా ఉండమంటే ఎందుకుంటుంది! మిడిమిడిగా శాస్త్రజ్ఞానం వున్న ఒకళ్ళిద్దర్ని పెట్టుకుని (వాళ్లచేత గాడిద పనిచెయ్యించి, నాలుగు ముష్టిరాళ్ళు యిచ్చి) వాళ్ళను

పనిచెయ్యండర్రా అంటే లాభం లేదు. సంఘం అవసరాలు తీర్చాలన్నా, పరిశ్రమ బాగుపడాలన్నా యిది తిరుపతి మంగలి క్షౌరం లాగా జరపకూడదు.

పారిశ్రామికాధిపతులు గాని, వ్యాపారస్థులు గాని ప్రజలకు వస్తు సమృద్ధి కలిగించడానికేమైనా పాటుబడ్డారా? శాస్త్ర విజ్ఞానాన్నీ, ప్రకృతి సంపదనూ వినియోగించి దేశాన్ని సుభిక్షం చెయ్యడానికి ప్రయత్నించారా? ఈ ప్రశ్నలకు తప్పనిసరిగా వచ్చే సమాధానంలా కేత్వం, దాకు కొమ్ము!

## రాజకీయవేత్తల బాధ్యత

ప్రజల జీవితాన్ని బాగుచెయ్యడానికీ, పాడుచెయ్యడానికీ సమర్థులైన రాజకీయవేత్తలూ, పారిశ్రామికాధిపతులూ ఉత్పత్తినీ - వినియోగాన్నీ వేరువేరుగా కాకుండా ఒకే మొత్తంగా చూస్తే, శాస్త్ర సిద్ధాంతాలకూ పారిశ్రామికాభివృద్ధికీ యింత ఎడబాటు కలిగి వుండేది కాదు. శాస్త్ర పరిశోధనల వల్ల వచ్చే ఫలితాలు వున్న పరిశ్రమలను అభివృద్ధిపరచడమే కాకుండా, యింకా కొత్త పరిశ్రమలను సృష్టిస్తాయి. ఇది చాలా ముఖ్యం.

ఇప్పుడు శాస్త్రజ్ఞుల విజ్ఞానం యెందుకు వృథా అవుతున్నదంటే - అతనికీ, ప్రజల అవసరాలకు పనికి వచ్చే ఉత్పత్తికీ మధ్యవున్న అగాధం వల్లనే.

యంత్ర నాగరికత ముందుకు పోతున్న కొద్దీ, శాస్త్ర విజ్ఞానం మీద సామాజిక జీవితానికి నమ్మకం హెచ్చుతున్న కొద్దీ, విద్యావిధానంలో తీవ్రమైన మార్పులు రావాలి. అది శాస్త్రీయ పద్ధతులపై జరగాలి. శాస్త్ర విజ్ఞానం యెన్నో విధాలుగా విద్యాభివృద్ధికి తోడ్పడింది. పుస్తకాలు, బొమ్మలు, ఫిల్ములు, గ్రామ ఫోన్లు, రేడియోలు, వైర్లెస్ మొదలైనవన్నీ విద్యాభివృద్ధికి యెంతో దోహదం చేశాయి. ఇవ్వన్నీ శాస్త్ర విజ్ఞానం కలిగించిన సౌకర్యాలు.

## ప్రజాయత్తం కావాలి

ఇప్పుడు శాస్త్ర విజ్ఞానం ప్రజలను కొల్లగొట్టడానికీ, సామ్రాజ్యాలు పెంచుకోడానికీ వినియోగపడుతున్నది. శాస్త్ర విజ్ఞానం కలిగించిన అవకాశాలను వ్యక్తులు దుర్వినియోగం చెయ్యడం వల్ల కలుగుతున్న దుష్ఫలితాలివి. పరిశ్రమలనూ, ప్రకృతి సంపదనూ వ్యక్తుల చేతుల నుండి ప్రభుత్వమే వశపరుచుకుంటే (నిజమైన ప్రజాస్వామిక ప్రభుత్వం ఉన్నప్పుడే ఇది సాధ్యమవుతుంది) ప్రజలూ సుఖపడతారు. శాస్త్ర విజ్ఞానమూ సఫలమవుతుంది.

**గమనిక: ఈ వ్యాసం మొదట భారతి పత్రిక ఆగష్టు 1947 సంచిక లో ప్రచురితమైనది.**

# ఆయుర్వేద శాస్త్రం-మూల సూత్రాలు



- డా. భాస్కర్ రావు
B.A.M.S, (Gold Medalist), M.D, Ph.D,
GURU, Ministry of Ayush, Govt. Of India, New Delhi
98491 47330

ఆయుర్వేదం అతిపురాతనమైన శాస్త్రం. దానికి పదివేల సంవత్సరాల చరిత్ర ఉన్నట్లు శాస్త్రీయ ఆధారాలు తెలియజేస్తున్నాయి. "ఆయుషః వేదః ఆయుర్వేదః" అను శ్లోకం ద్వారా 'ఆయుః' అనగా ప్రాణం, 'వేదః' అనగా శాస్త్రం. ఏదైతే శాస్త్రం ప్రాణం గురించి మరియు దాని పరిరక్షణార్థం చెప్పబడినటువంటి వివిధ రకములైన పద్ధతులను వివరించే శాస్త్రమే ఆయుర్వేద శాస్త్రం. దీనిని అనాదిగా మరియు ఆది అంతము లేని శాస్త్రముగా మరియు అధర్వణ వేదము యొక్క ఉపాంగముగా చెబుతారు.

## ఆయుర్వేద శాస్త్రం యొక్క ప్రత్యేకత :

ఆయుర్వేద శాస్త్రం శారీరక, మానసిక మరియు ఇంద్రియముల యొక్క సమతుల్యత మరియు తలనాత్మకత (Balance) దెబ్బతినడం ద్వారా ఏర్పడు శారీరక, మానసిక రోగముల యొక్క సంపూర్ణ చికిత్సా పద్ధతులను వివరించే శాస్త్రం.

అంతే కాకుండా ఎనిమిది (8) ప్రత్యేక విభాగాలతో (Specialities) అవి

1) కాయా చికిత్సా (General Medicine)
2) శల్య చికిత్సా (Surgery)
3) శాలాక్య (ENT & Opthalmology)
4) కౌమారభృత్య (Paediatrics)
5) ఆగధ తంత్రము (Toxicology)
6) భూత చికిత్స (Micro - biology)
7) వృద్ధుల వైద్య విభాగం (Geriatrics) మరియు
8) వాజీకరణము (Sexology)



ఆధునిక శాస్త్రములో కూడా పైవన్నియు కూడా Specialisations మరియు Super Specialities గా ఉన్న విషయము తెలిసిందే.

## ఆయుర్వేద శాస్త్రం దేని ఆధారంగా చెప్పబడింది?

శరీరము మనసు మరియు ఆత్మల కలయికగా ఉంటూ త్రిదోషములైన వాతము, పిత్తము మరియు కఫముల చేత నిర్మింపబడి వుంటుంది అని సిద్ధాంతీకరిస్తుంది. ఇందు వాతము శరీరము యొక్క కదలికలు, ప్రతిస్పందనలకు ప్రతిరూపమైన కేంద్ర నాడీ వ్యవస్థ ను ప్రతిబింబిస్తుంది. పిత్తము శరీరము యొక్క అరుగుదల, వివిధ రసాయన ప్రక్రియల ఆలంబనగా వుంటూ జీవక్రియ ను ప్రతిబింబిస్తుంది. కఫము నీరు ప్రధానాంశముగా ఉంటూ శరీరము యొక్క ధృడత్వాన్ని, సంఘటితాన్ని చేయగల అంశముగా ఉంటూ కండరాల అస్థిపంజర వ్యవస్థ ను ప్రతిబింబిస్తుంది. అంతేగాకుండా శరీర సంఘటితంలో ప్రధాన భూమికను పోషించే రసము (Lymph), రక్తం (Blood), మాంసము (Muscle Tissue), మేధ (Fat Tissue), అస్తి (Bone Tissue), మజ్జా (Bone Marrow) మరియు శుక్రం (Semen) సప్త ధాతువులుగా చెప్పబడి వున్నాయి. అలాగే శరీరములో వ్యర్థముగా మిగిలిపోయే మూడు మలధాతువులైన మలము (Faeces), మూత్రం (Urine) మరియు స్వేదం (Sweat) లు కూడా ఆరోగ్య పరిరక్షణ ముఖ్యాంశములుగా వుంటాయి. ఎందుకంటే ఆయుర్వేద శాస్త్రం దోషములు, ధాతువులు మరియు మలముల యొక్క సంతులనము (Balance) దెబ్బతినటం

ద్వారా అనారోగ్యమును కలిగించును అని నమ్ముతుంది. అందువలనేమో వీటి సంతులనము దెబ్బతినకుండా కాపాడే శాస్త్రం ఆయుర్వేద శాస్త్రము.

## ఆయుర్వేద మూల సిద్ధాంతాలు :

ఆయుర్వేద శాస్త్రము శరీరములోని అంశాలన్నింటికీ కూడా ప్రపంచములో లేదా ప్రకృతితో అనుసంధానిస్తుంది. నిజానికి శరీరాన్ని Microcasm గాను, ప్రకృతిని Macro Cosm గాను అభివర్ణిస్తుంది. శరీరములో ఉండే దోషాలు ధాతువులు మరియు మలాలు అన్నియు కూడా బాహ్య ప్రపంచంలో ప్రకృతిలో ఏదో ఒక విధంగా అనుసంధానిస్తాయి. శరీరములోని అన్ని మార్పులు, చేర్పులు కూడా ప్రకృతిలోని రూపాంతరాలై ప్రతి క్రియగా ఉంటుందనడంలో సందేహం లేదు.

శరీర అంతర్గములైన అన్ని జీవన ప్రక్రియలకు ఆహారం ఇంధనం అందిస్తే, నిద్ర ద్వారా శరీరానికి స్వాంతన లభిస్తుంది. బ్రహ్మచర్యము (Celibacy) అనేది ఇంద్రియ నిగ్రహమునకు సంబంధించిన విషయం. శరీరక మానసిక కార్యాల యందు సత్వ-రజో-తమస్సులైన మూడు మానసిక దోషముల యొక్క నిగ్రహము బ్రహ్మచర్యం ద్వారా లభిస్తుంది. అందుచేతనే వీటిని త్రయ ఉప స్థంబములు లేదా మూడు ఉప స్థంబములు అంటారు.

## ఆయుర్వేదం ద్వారా ఏమి సాధించవచ్చు :

1. ఆయుర్వేదం వ్యాధుల నివారణలలో ప్రధాన భూమికను పోషిస్తుంది కనుక Preventive Health Care System లో ఆయుర్వేదం అతి ముఖ్యమైన అంశముగా ఉంటుంది.

2. దీర్ఘకాలిక వ్యాధులైన రుమాటాయింట్ ఆర్థరైటిస్, పాలి అర్థరైటిస్, లివర్ వ్యాధులు, అలెర్జి వ్యాధులు, ఆస్తమా, షుగర్ వ్యాధులు, చర్మ సంబంధ వ్యాధులు మరియు రోగనిరోధక శక్తి రాజీ కారణంగా సంక్రమించే వ్యాధులు... మొదలైన వాటికి ఆయుర్వేదంలో ఉత్తమ చికిత్స దొరుకుతుంది.

3. శరీరాన్ని శుద్ధి చేయగలిగే అనే పంచకర్మ విధానము (Detox) మరియు రక్తాన్ని శుద్ధిచేయగలిగే రక్తమోక్షణము (Venesection, Leach Therapy) ఆయుర్వేదంలో వున్నాయి.

4. బరువును పెంచడంలోను మరియు తగ్గించడంలోను ఆయుర్వేద శాస్త్రం ఎలాంటి దుష్పరిణామాలు లేకుండా చేయగలదు.

5. ప్రకృతి లేదా మనిషి శరీర నిర్మాణం ఆధారంగా రోగనిర్ధారణ చేయడంతో పాటుగా వ్యక్తిగత చికిత్సను (Personalised Medicine) అందించే అద్వితీయ శాస్త్రము ఆయుర్వేదము.

## ఆయుర్వేదం అనారోగ్యాన్ని ఎలా గుర్తిస్తుంది?

అనారోగ్యాన్ని గుర్తించడానికి ఆయుర్వేదంలో రెండు ప్రధాన పద్ధతులున్నాయి-

- శరీర అంతర్గత వ్యవస్థలైన త్రిదోషములు, సప్తధాతువులు లేదా త్రిమలములలో వ్యత్యాసముల చేత శరీరంలో కలిగే వివిధ లక్షణాల ద్వారా ఆరోగ్యం దెబ్బతింటున్నది అన్న విషయాన్ని గుర్తిస్తారు.

- శరీరము మనసు, ఇంద్రియములు మరియు ఆత్మ మరియు చైతన్యాల యొక్క సంతులనం దెబ్బతినడం ద్వారా ప్రధానంగా అనారోగ్యం కలుగుతుందనే విషయం ఆయుర్వేదం ప్రతిపాదిస్తుంది. ఆధునిక వైద్య శాస్త్రము కూడా ఈ విషయాన్ని అంగీకరిస్తుంది.

## ఆయుర్వేదములో Blood Transfusion విధానము లేదా Blood Purification విధానము ఉందా?

కొన్ని వేల సంవత్సరాల క్రితమే ఆయుర్వేద శాస్త్రములో శరీరాన్ని మరియు రక్తాన్ని శుద్ధిచేసే ప్రక్రియలను పంచకర్మ విధానములో (Detox) శోధనము ద్వారాను, రక్తమోక్షణ విధానాలైన Venesection, Leach Therapy ద్వారా వివరింపబడి యున్నాయి. రక్తమోక్షణ విధానాన్ని ఈ రోజుల్లో కూడా Hereditary Hemochromatosis (శరీరములో అత్యధిక Iron శాతము ఉండడటానికి) మరియు Polycythemia (అత్యధిక Red Cells యొక్క కణజాలము యుండడాన్ని) తొలగించే అత్యవసర ప్రక్రియగా ఆమోదించారు.

## ఆయుర్వేదంలో కరోనా వ్యాధి ప్రస్తావన ఉందా?

ఆయుర్వేదంలో కరోనా వ్యాధి యొక్క అవగాహన ప్రత్యక్షంగా లేకపోయినప్పటికీ వేలాదిమంది నగరాలకు నగరాలలోని ప్రజలు ఒకేసారి

ఏకమొత్తంగా ఒకే వ్యాధి లక్షణాలతో వేల సంఖ్యలో మరణించడాన్ని ఆయుర్వేద శాస్త్రం జనపదోద్వంసముగా (epidemic) వర్ణించడం జరిగినది.

ఈ విషయాన్ని చరక సంహితలోని (100బిసి) విమానస్థానము 3వ అధ్యాయములో ఈ వ్యాధి విపులంగా చెప్పబడింది. దీని ఆధారంగా భారత ప్రభుత్వం కూడా నేషనల్ టాన్స్ ఫోర్స్ ఇన్ ఆయుష్ రీసెర్చ నుఏప్రిల్ 2020లో ఏర్పరచడం జరిగింది. తద్వారా అశ్వగంధ (Withania Somnifera) తిప్పతీగ (Tinospora cordifolia), యష్టిమధు (Glycirryza Glabra), పసుపు (Turmeric powder), మిరియాలు (piper nigrum) మరియు వేప (neem) లాంటి అద్భుత ఔషధ సమాహారంతో ఆయుర్వేద చికిత్సకు ఉపకరించడం జరిగింది. దీనిపై మినిస్ట్రీ ఆఫ్ ఆయుష్ భారత ప్రభుత్వం చేత నిర్ణయించబడిన ప్లాసిబో కంట్రోల్ డబుల్ బ్లైండ్ క్లినికల్ స్టడీ ద్వారా, వారి మార్గనిర్దేశానుసారము ఆయుష్ 64 మాత్రలు మరియు కబాసురా కుడనీర్ లాంటి క్వాద చూర్ణములను కోవిడ్ వ్యాధి యొక్క మొదటి, రెండవ దశలో వాడడానికి అనుమతించడం జరిగినది. వాస్తవానికి వీటిలో వుండే మూలికా విశ్లేషణలన్నీ కూడా యాంటీ వైరల్, వైరోస్టాటిక్ మరియు ఇమ్యూనిటీ బూస్టర్స్ గా రుజువు చేయబడ్డ విషయము విదితమే.

## ఆయుర్వేదం యొక్క పరమావధి :

ఆయుర్వేదం ఆరోగ్య పరిరక్షణ మరియు చికిత్సల పరమావధిగా ఉంటూ శుద్ధి (Detoxification) మరియు శమనము (Pacification) ద్వారా చికిత్స సౌలభ్యం కలిగిస్తుంది. ఇందుకే ఏ శాస్త్రములో కూడా చెప్పనటువంటి దినచర్య (Daily Activities), ఋతుచర్య (Seasonal Activities) మరియు సద్వృత్తం (Spritual Activities) తో పాటుగా రసాయన చికిత్స (Rejuvenation Therapy), వాజీకరణ చికిత్స (Aphrodiasic Measures) అనే బహుముఖ చికిత్స ప్రక్రియలు ఆయుర్వేదం యొక్క మూల సిద్ధాంతానికి ఆలంబనగా ఈనాటికీ ఆయుర్వేదం మనుగడ సాధించడానికి మూల హేతువుగా ఉన్నాయి. ప్రపంచంలో అత్యంత ఆదరణ పొందుతున్న యోగా, ధ్యానం కూడా ఆయుర్వేద ప్రక్రియలలో అంతర్భాగ్యమే.

# మైటోకాండ్రియా - అనువంశికత - వ్యాధులు



- వింజనంపాటి రాఘవరావు
✆ 92474 44994

పదవ తరగతి పాసైన వారందరికీ జన్యుశాస్త్రం (Genetics) గురించిన కనీసపు అవగాహన ఉంటుంది. మనలోని లక్షణాలు కొన్ని తల్లి నుండి, మరికొన్ని తండ్రి నుండి సంక్రమిస్తాయని అందరికీ తెలుసు. స్త్రీ, పురుష లింగభేదానికి సంబంధించి రెండు ఎక్స్ (X) క్రోమోజోములుంటే ఆడ, ఒక ఎక్స్, ఒక వై (Y) క్రోమోజోములుంటే మగ. మనం అంతగా పట్టించుకోని లక్షణాలు కేవలం ఆడ లేదా మగవారికి మాత్రమే పరిమితమై ఉంటాయి. ఉదాహరణకు బట్ట తల (Bald Head). ఈ లక్షణాలకు సంబంధించిన జన్యువులు (Genes) ఆడ, మగ ఇద్దరిలో ఉన్నప్పటికీ వ్యక్తమయ్యేది పురుషులలో మాత్రమే. స్త్రీలలో కూడా అత్యంత అరుదుగా ఈ లక్షణం కనపడినప్పటికీ జుత్తు పలుచగా, ఉండటానికి మాత్రమే ఉంటుంది. దీని ఎలోపిసియా (Alopecia) అంటారు.

మనకు తల్లిదండ్రుల నుండి సంక్రమించిన లక్షణాలన్నీ కణాలలోని కేంద్రకంలో ఉండి జన్యువుల ద్వారా వస్తాయని మనందరి సాధారణ భావన. కాని ఇది పూర్తిగా నిజం కాదు. కణద్రవ్యం (Cytoplasm) లో ఉండే వివిధ కణాంగాలు కూడా అనువంశికత (Inheritance)కు కారణమని నిరూపించబడింది. దీన్ని కేంద్రక బాహ్య అనువంశికత (Extranucear Inheritance) అని కూడా అంటారు. దీనినే కణద్రవ్య అనువంశికత (Cytoplasmic Inheritance) అనికూడా అంటారు. దీన్ని కారెన్స్ (Correns 1909) అనే శాస్త్రవేత్త మెండిల్ సూత్రాలకు విరుద్ధంగా సందెమల్లె (4,O clock plant) మొక్కలలో గమనించాడు. పూర్తిగా ఆకుపచ్చగా ఉండే ఆకులతోపాటు మచ్చలు ఉన్న ఆకుల అనువంశికత కణద్రవ్యంలో ఉండే క్లోరోప్లాస్టుల ద్వారా జరుగుతుందని నిర్ధారించాడు. అలాగే నత్త గుల్లలలో, గుల్ల కుడి, ఎడమ వైపులకు సర్పిలాకారం (Spinal) తిరగటం కూడా కణద్రవ్యంలో ఉండే కారకాల వల్లనే జరుగుతుంది. బాగా అభివృద్ధి

చెందిన జీవులలో ఈ విధమైన అనువంశికత సాధ్యమేనా? అంటే సాధ్యమే అనే సమాధానం వస్తుంది.

నాగరిక ప్రపంచంలో డబ్బే శక్తి. 'డబ్బులేని వాడు డబ్బుకు కొఱగాడు' అని సామెత. డబ్బులేని వాడి గురించి ఒక్కమాటలో చెప్పాలంటే 'వాడిదగ్గరేముంది బూడిద' అంటాం. అంటే డబ్బుకు సంబంధించి శక్తిహీనుడని మన భావన. కట్టె పూర్తిగా కాలకపోతే బొగ్గవుతుంది. బొగ్గును శక్తిహీనం చేయాలంటే బూడిదయేవరకు మండించాల్సిందే.

జీవితావసరాలకు అవసరమైన శక్తి కోసం జీవులన్నీ ప్రధానంగా గ్లూకోజ్ (Glucose) అనే పిండిపదార్థం (Carbohydrate) పైన ఆధారపడతాయి. గ్లూకోజ్ విచ్ఛిన్నం చేయటం ద్వారా విడుదలయ్యే శక్తి ఏ.టి.పి. (ATP) అనే రసాయనంలో నిక్షిప్తం చేయబడుతుంది. ఈ ఏ.టి.పి. అవసరమైన చోటికి రవాణా చేయబడి, విచ్ఛిన్నం చేయటం ద్వారా శక్తి విడుదలవుతుంది. ఏ.టి.పి.నే 'ఎనర్జీ కరన్సీ' (Energy Currency) అంటారు.

గ్లూకోజ్‌లోని శక్తి ఏ.టి.పి.గా మారాలంటే అనేక రసాయన చర్యలకు లోనుకావలసి ఉంటుంది. ఈ దశలన్నింటినీ గ్లైకాలసిస్ (Glycolysis) క్రెబ్స్ సైకిల్ (Krebs Cycle) ఎలక్ట్రాన్ ట్రాన్స్ పోర్ట్ (Electron Transport) లనే మూడు భాగాలలో జరుగుతుంది. బాక్టీరియా వంటి జీవులలో గ్లైకాలసిస్ తర్వాతి రెండు



చర్యలు జరగటానికి అవసరమైన మైటోకాండ్రియా (Mitochondria) లనే కణాంగాలు ఉండవు. అందువలన చాలా నిమ్నస్థాయి జీవులలో అంత్యపదార్థంగా లాక్టిక్ ఆమ్లం (Lactic Acid) లేదా ఇథనాల్ ఆల్కహాల్ (Alcohal) ఏర్పడతాయి. వీటిలో ఇంకా చాలా శక్తి ఉంటుంది. గ్లైకాలసిస్ చర్యల చివరిలో తయారయే పైరువిక ఆమ్లం (Pyruvic Acid) మైటోకాండ్రియాలలోకి ప్రవేశించి పూర్తిగా విడగొట్టబడి దానినుండి విడుదలైన శక్తి ATPలో నిల్వచేయబడుతుంది. అంత్యపదార్థాలుగా కార్బన్-డై-ఆక్సైడ్ (Co2) నీరు ఏర్పడతాయి.

అమీబావంటి ఆ కణజీవుల నుండి బాగా అభివృద్ధి చెందిన వృక్షాలలోనూ, జంతువులలోనూ మైటోకాండ్రియాలుంటాయి. ఈ మైటోకాండ్రియాలు సుమారు ఒకటిన్నర బిలియన్ సంవత్సరాల క్రితం నిజకేంద్రక జీవుల (Eukaryote)లోనికి అంతర సహజీవులు (Endosymbionts) గా ప్రవేశించాయని ఒక సిద్ధాంతం. దీనికి కారణం మైటోకాండ్రియాలు స్వతంత్రమైన DNA ను కలిగి ఉంటాయి. ఈ DNA పదార్థమే అనువంశికతకు మూలాధారం.

శరీరంలోని కణవిభజనతో సంబంధం లేకుండా, మైటోకాండ్రియాలు స్వతంత్రంగా విభజన చెందుతాయి. వీటి విభజన సాధారణ విచ్ఛిత్తి (Fission) లాగా ఉంటుంది. వీటిలో డి.ఎన్.ఏ. (DNA) ఉండటం వల్ల పాక్షిక స్వయం ప్రతిపత్తి కలిగి ఉంటాయి. జీవన క్రియలు చురుకుగా జరిగే కణాలలో వీటి సంఖ్య ఎక్కువ. అమీబా (Amoeba) లో యాభైవేల వరకూ, కప్ప వంటి ఉభయచరాల గ్రుడ్ల (Egg)లో మూడు లక్షల వరకు, మానవుల కాలేయంలో కేవలం వెయ్యి నుండి రెండువేల వరకు ఉంటాయి. మన గుండె కణంలో నలభైశాతం మైటోకాండ్రియా ఆక్రమిస్తాయి.

మన శరీరానికి అవసరమైన శక్తిలో తొంభైశాతం మైటోకాండ్రియాలోనే తయారవుతుంది. దీనితోపాటు స్టిరాయిడ్ హార్మోన్లు, డి.ఎన్.ఏ, మూల పదార్థాలు మైటోకాండ్రియాలో తయారవుతాయి. మైటోకాండ్రియా పనిచేయుట మానేసినా, వీటి పనిలో తేడా వచ్చినా, శరీరంలో ఎక్కువ శక్తిని వినియోగించుకునే భాగాలైన మెదడు, గుండె, ఊపిరితిత్తులు, శ్వాసవ్యవస్థ, కాలేయం, అస్థి కండరాలు, వినాళా గ్రంథులు మొదలైనవి దెబ్బతింటాయి. దీనివలన ప్రధానంగా వచ్చే సమస్యలు:

1. ఎదుగుదల తగ్గటం 2. కండరాల బలహీనత 3. దృష్టి, వినికిడి లోపాలు 4. మానసిక పటుత్వం తగ్గటం

5. హృదయ, కాలేయ వ్యాధులు 6. శ్వాస సమస్యలు 7. రక్తంలో గ్లూకోజ్ శాతం తగ్గటం 8. కనురెప్పలు భారంగా ఉండి మూసుకుపోవటం 9. లాక్టిక్ ఎసిడోసిస్ 10. ఎదుగుదల ఆలస్యం కావటం 11. మధుమేహం 12. జీర్ణవ్యవస్థ సమస్యలు 13. శారీరక కదలిక లోపాలు మొదలైనవి

ప్రస్తుతం క్యాన్సర్‌తో సమానంగా మైటోకాండ్రియాకు సంబంధించిన వ్యాధుల బారిన చిన్నపిల్లలు పడుతున్నారంటున్నారు శాస్త్రవేత్తలు. అమెరికాలో ప్రతి నాలుగు వేలమందిలో ఒకరు పదిసంవత్సరాల వయసు వచ్చేసరికి ఈ వ్యాధులకు గురౌతున్నారు. భారతదేశంలో ఈ వ్యాధికి సంబంధించి పెద్దగా సమాచారం లేదు. పెద్దవారిలో కూడా మైటోకాండ్రియాకు సంబంధించిన వ్యాధులు కనిపించినప్పటికీ పార్కిన్సన్ వ్యాధి, హృదయ సంబంధ వ్యాధులు, అల్జీమర్స్, కాన్సర్‌లలో మైటోకాండ్రియాల ప్రభావం కనిపిస్తుంది. చాలారకాల ఔషధాలు మైటోకాండ్రియాలను దెబ్బతీసేవిగా ఉన్నాయంటున్నారు శాస్త్రవేత్తలు.

మైటోకాండ్రియాకు సంబంధించిన వ్యాధులను గుర్తించటం చాలా కష్టమైన విషయం. ఒకేసారి మూడు, అంతకంటే ఎక్కువ అవయవాలు వ్యాధికి గురైనప్పుడు, ఒకే వ్యాధి మరలా మరలా తిరగబెడుతున్నప్పుడు, ఇన్‌ఫెక్షన్ల వలన తీవ్రమైన వ్యాధులబారిన పడుతున్నప్పుడు, మైటోకాండ్రియా వ్యాధికి సంబంధించిన వ్యాధిగా గుర్తించవచ్చు.

మైటోకాండ్రియా సంబంధించిన వ్యాధులకు ప్రత్యేకమైన వైద్యవిధానమంటూ ఏదీ లేదు. వైద్యులు లక్షణాలకు సంబంధించిన చికిత్సను అందిస్తారు.

ఈ మైటోకాండ్రియాలు ఒక తరం నుంచి మరొక తరానికి తల్లి ద్వారానే అందించబడతాయి. స్త్రీ అండంలో సరాసరి లక్ష నుండి ఆరు లక్షల మైటోకాండ్రియాలుంటే, శుక్ర కణంలో కేవలం యాభై నుండి డెబ్బై ఐదు మాత్రమే ఉంటాయి. తల్లి మైటోకాండ్రియాల DNA లో లోపం ఉన్నట్లయితే అది సంతానం అందరికీ ఆ వ్యాధి వస్తుంది. అయితే మైటోకాండ్రియా సంబంధిత వ్యాధులలో తండ్రి బాధ్యతను కూడా తీసివేయలేం అంటున్నారు ఆధునిక శాస్త్రవేత్తలు.

మైటోకాండ్రియాలలోని డి.ఎన్.ఏ.ల భేదాలన్నింటినీ (Variations) ఒకచోట చేర్చి మైటోమేప్ (Mitomap - Mitochondrial Genome Database) తయారుచేశారు. భవిష్యత్తులో మైటోకాండ్రియా వలన వచ్చే జన్యువ్యాధులను నివారించటానికి ఈ మైటోమేప్ ఉపయోగపడవచ్చు.

सत्यमेव जयते

भारत के उपराष्ट्रपति

VICE-PRESIDENT OF INDIA

ఆచార్య కొవ్వలి గోపాలకృష్ణ గారికి,

నమస్తే

ఆధునిక తెలుగు సాహితీ మార్గానికి దిశానిర్దేశం చేసిన మహాకవి శ్రీ గురజాడ అప్పారావు స్థాపించిన ప్రకాశిక పత్రికను తిరిగి మీ సంపాదకత్వంలో అంతర్జాల వేదిక ద్వారా ముందుకు తీసుకువెళుతున్న మీకు, ఈ పత్రిక అభివృద్ధిలో భాగస్వాములైన వారందరికీ అభినందనలు తెలియజేస్తున్నాను.

భారతదేశ మాజీ ప్రధాన మంత్రి, తెలుగు తేజం శ్రీ పి.వి.నరసింహారావు గారి శతజయంతిని పురస్కరించుకుని ప్రకాశిక త్రైమాసిక పత్రిక(ఏప్రిల్-జూన్ సంచిక)లో బహుముఖ ప్రతిభా రత్నం పేరిట ఎంతో మంది పీవీ గారి గురించి రాసిన వ్యాసాల సంకలనం ద్వారా అక్షర నివాళులు అర్పించిన మీ చొరవను అభినందిస్తున్నాను.

ప్రకాశిక అంతర్జాల పత్రిక నాణ్యత సైతం చక్కగా ఉంది. రాశితో పాటు వాసి కూడా ఉన్న ఈ పత్రికలో అందరి వ్యాసాలు ఆకట్టుకునే విధంగా ఉన్నాయి. వ్యాసకర్తలందరికీ పేరుపేరునా అభినందనలు.

నేనెంతగానో అభిమానించే శ్రీ గురజాడ అప్పారావు గారి స్ఫూర్తితో తెలుగు భాషను కాపాడుకుంటూ, తెలుగు సాహిత్యాన్ని ముందు తరాలకు అందిస్తూ ప్రకాశిక త్రైమాసిక పత్రిక ప్రస్థానం మేలిబాటలో ముందుకు సాగాలని ఆకాంక్షిస్తూ, శుభాకాంక్షలు తెలియజేస్తున్నాను.

(ముప్పవరపు వెంకయ్య నాయుడు)

న్యూఢిల్లీ,
28 మే, 2021.

**శ్రీ పివి నరసింహారావు గారి మీద ప్రకాశిక ప్రచురించిన ప్రత్యేక సంచికని ఆసాంతం చదివి అభినందన పూర్వక అభిప్రాయాలు తెలియజేసిన భారత ఉపరాష్ట్రపతి శ్రీ వెంకయ్య నాయుడు గారికి ధన్యవాదాలు**

**- ప్రకాశిక సంపాదకవర్గం**



* వంచిత వాసవసర్జిక *

బొమ్మ: వడ్డాది పాపయ్య గారు
సుంకర చలపతిరావు గారి సౌజన్యంతో



# భారత స్వాతంత్ర్య వజ్రోత్సవ శుభాకాంక్షలు

జయ జయ జయ ప్రియ భారత జనయిత్రీ దివ్యధాత్రి
జయ జయ జయ శత సహస్ర నర నారీ హృదయనేత్రి
జయ జయ జయ శత సహస్ర నర నారీ హృదయనేత్రి
జయ జయ జయ ప్రియ భారత జనయిత్రీ దివ్యధాత్రి

జయ జయ సశ్యామల సుశ్యామచలాచ్చేలాంచల
జయ జయ సశ్యామల సుశ్యామచలాచ్చేలాంచల
జయ వసంత కుసుమలతా చలిత లలిత చూర్ణకుంతల
జయ మదీయ హృదయాశయ లాక్షారుణ పదయుగళా
జయ జయ ప్రియ భారత జనయిత్రీ దివ్యధాత్రి

జయ దిశాంత గత శకుంత దివ్య గాన పరితోషణ
జయ దిశాంత గత శకుంత దివ్య గాన పరితోషణ
జయ గాయక వైతాళిక గళ విశాల పత విహరణ
జయ మదీయ మధురగేయ చుంబిత సుందర చరణా

జయ జయ జయ ప్రియ భారత జనయిత్రీ దివ్యధాత్రి
జయ జయ జయ శత సహస్ర నర నారీ హృదయనేత్రి
జయ జయ జయ శత సహస్ర నర నారీ హృదయనేత్రి
జయ జయ జయ ప్రియ భారత జనయిత్రీ దివ్యధాత్రి

- దేవులపల్లి కృష్ణ శాస్త్రి